సూచన — చిన్న అచ్చులో నున్నవిషయములు సెకండరీ గ్రేడుకు మాత్రమే.

---

For Copies apply to -

SRI P. L. KRISHNA SARMA,
PAKALA B. O.
Via Woollapalem.
Nellore Dt

or

SRI M. P. NARASIMHAM,
Gauthama Nilayam,
Usmansahebpet,
Nellore.

# మాతృభాషా బోధన

## మాతృభాషా ప్రాముఖ్యము



మానవుఁడు సంఘజీవి. ప్రతివాఁడు తన సంఘమునందలి యితరవ్యక్తులతో వ్యవహారించ వలసి వచ్చును. వారి యభిప్రాయములను దాను గ్రహించుటయుఁ దన యభిప్రాయములను వారికి వ్యక్తము చేయుటయు ముఖ్యావసరములు. ఈ రెండు ప్రయోజనములను సాధించుట కుపయోగపడు సాధనమే భాష.

మానవ సంఘమందలి ప్రతి వ్యక్తియును తన శైశవ దశయందును, బాల్యదశయందును దాను నివసించు గృహము నందలి యితర వ్యక్తులను, సంచరించు సంఘమునందలి యితర వ్యక్తులను అనుకరించుటవలన భాషను నేర్చుకొనుట సంభవించుచున్నది. ఈవిధమున బుద్ధిపూర్వకముగాఁ జేయు ప్రయత్నమువలన గాక యప్రయత్న సిద్ధముగాఁ జేయు "అనుకరణ" యను సహజధోరణిచే నలవడు భాషయే మాతృభాష యనఁబడుచున్నది.

బాల్యదశయందు ఉపాధ్యాయుని సహాయమున బాలుఁడు మాతృభాషయందింకను కృషిచేయును. అంతకుమునుపు మాతృభాషయందు మాటలాడుటను మాత్రమే నేర్చుకొనిన బాలుఁడు బడియందు పఠనమును, లేఖనమును, రచనమును గూడ నేర్చుకొని కాలక్రమమున సారస్వతమునఁ గూడఁ బరిచయముఁ గాంచును.

భారత దేశమున నాయా ప్రదేశములయందు వ్యవహరించఁబడుచున్న

దేశభాషలే యాయాప్రాంతములవారికి సామాన్యముగా మాతృభాషలుగా నుపయోగపడుచున్నవి.

మానవ జీవితమున మాతృభాషా ప్రాముఖ్యము సాటిలేనిది. తల్లి పాలవలన శిశువు చక్కని శరీర పుష్టిని బడయునట్లు మాతృభాషామూలమున బాలుడు భావిజీవితమునకుఁ గావలసిన మానసిక శిక్షణమును బడయును. భాషకును, భావమునకు నొకదానిని విడిచి యొకటి యుండలేనట్టి సంబంధముగలదు. మనస్తత్వశాస్త్రవేత్తలిట్టి భాషాభావముల నానా భావసంబంధమును గూర్చి స్పష్టముగాఁ జెప్పుచున్నారు. మనస్సునందలి యభిప్రాయములు రూపముఁ దాల్చుటకు భాష యవసరము. మాటలాడవలె నన్న వక్త మనసునందేదేనొక భావముండి తీరవలయును. బాలుడు సర్వావసరములయందును తన మనోగతభావముల వెల్లడించుట కుపయోగించునది మాతృభాషయే గాని యితరము గాదు. ఇట్టి భాషను సుస్థిరముగాఁ బ్రయోగించుటయందు బాలునకచ్చు శిక్షణము విద్యాబోధనలోఁ బ్రథమ స్థానమాక్రమించి మానవ సంస్కృతికి సాటిలేని సాధనముగాఁ బరిణమించుట సహజమే. కావున మాతృభాష యందుఁ దగిన కృషి చేయుటవలన బాలుని భావి మానసిక వ్యాసంగమునకు మంచి పునాది యేర్పడుచున్నది.

సంభాషణల రూపమునను, రచనల రూపమునను భావ వ్యక్తీకరణము చేయవలసిన యవసరము ప్రతి వ్యక్తికిని గలదు. అందులకుఁ బ్రతి పౌరుడును మాతృభాషను సమగ్రముగా నభ్యసింపవలసియున్నది. సరిగా భావించుటయుఁ, దదనుగుణమైన స్పష్ట వ్యక్తీకరణమును, ప్రమాణశుద్ధియు సంపూర్ణజీవిత సంపాదనమును మాతృభాషను బాగుగా నభ్యసించిననే గాని యలవడవు.

బాలుని సర్వతోముఖాభివృద్ధి మాతృభాషాబోధనపై నాధారపడి యున్నది. మానసికాభివృద్ధికిని, జ్ఞానాభివృద్ధికిని, వ్యక్తీకరణ శక్త్యభివృద్ధికిని

స్వీయ వికాసమునకును మాతృభాషాపరిజ్ఞాన మత్యంతావశ్యకము. వ్యక్తిత్వమును రూపొందించుటకును బెంపొందించుటకును మాతృభాషావాఙ్మయము మిక్కిలి సహాయకారి. పరభాష యీ ఫలముల నిచ్చుట కసమర్థ మగుచున్నది.

మాతృభాషయందుఁ జక్కని పరిజ్ఞానము సంపాదించినపిదప బాలురు తనకవసరమని తోచిన పరభాషలను నేర్చుట సులభము. అప్పటికి బాలునకొక వయోదశ గడచుటతోఁబాటు పరభాషాభ్యాసమునకుఁ దగిన మానసికాభివృద్ధియు నేర్పడియుండును. మాతృభాషయందేర్పడిన వ్యాకరణజ్ఞానమేమి, వాక్యరచనాభ్యాసమేమి, జాతీయములు ప్రయోగించుటయందలి పాటవమేమి, పరభాష నభ్యసించుటయందు మిక్కిలి యుపయుక్తముగా నుండును.

మాతృభాషా వాఙ్మయమును జదువునప్పుడుగాని, వినునప్పుడుగాని పొందఁగలుగునంత యానందము పరభాషల యందలి వాఙ్మయమును జదువునప్పుడుగాని వినునప్పుడుగాని పొందలేకుండుట మనకుఁ దెలిసిన విషయమే. మాతృభాషయందలి జాతీయములు, లోకోక్తులు మున్నగునవి కల్గించు నానందానుభూతిని పరభాషలందలివి కల్గింపలేవు. మఱియు తన యభిప్రాయముల నితరులకు వాగ్రూపమునఁగాని లిఖితరూపమునఁగాని వ్యక్తము చేయుటకును దన్మూలమున మానవ సంఘాభివృద్ధికిఁ దోడ్పడుటకును మానవునకు మాతృభాష సహాయపడుచున్నది.

1948 వ సంవత్సరమున దేశభాష ద్వితీయ స్థానమునుండి ప్రథమ స్థానమునకు మార్చఁబడుట గూడ జరిగినది. ఇంతకుఁ బూర్వము నాల్గవ తరగతినుండియే నేర్పఁబడు ద్వితీయభాష యిప్పుడాఱవ తరగతి నుండి మాత్రమే నేర్పఁబడవలెనని శాసింపఁబడినది. మాతృభాషయందుఁ జక్కని పరిజ్ఞానము లేనివారికిఁ బర భాష నేర్చుకొనుట కష్టమనియు, లేతవయస్సు

బాలుఁడు తన మనోభిప్రాయములను ప్రకటించునట్లు చేయవలెను. జ్ఞాన సంపాదనమునకును క్రొత్తపదముల సముదాయమును నేర్చుకొనుటకును దగిన పఠనాభ్యాసమును బాలురకుఁ గలుగఁజేయుటతోఁ బాటుగా నానందానుభూతికిఁ బనికివచ్చు పఠనాభ్యాసమును గూడ గలుగఁజేయవలెను. స్వతంత్రముగా రచనను జేయఁగల శక్తి బాలురలో నేర్పడునట్లుగాఁ బ్రయత్నించవలెను. అందుకొరకు బాలురను రచయితలను జేయుటకు వీలగును బాలుర యాలోచనలు సహేతుకములుగా నుండునట్లు చూడవలెను.

ఆధునిక పాశ్చాత్య శాస్త్ర విజ్ఞానమునకుఁ జెందిన పారిభాషిక పద సముదాయమును, స్పష్టముగా నాయా విషయములను బ్రకటించఁగలశక్తియు భారతదేశ భాషలకు లేవను సాకుతో మొదట నాంగ్లభాషనే బోధనా సాధనముగాఁ దీసికొనుటయు దేశభాషలను దిరస్కరించుటయు జరిగెను. ఎంత సమగ్రమైనదైనను నాంగ్ల భాష పరభాషయే యగుటచే దానివలనఁ గలిగిన దుష్ఫలితములు క్రమముగాఁ దెలిసెను. ఆదోషములను నివారించవలెనన్నచో నాంగ్లము స్థానమున మాతృభాష నుపయోగించుటయే కర్తవ్యమని యెన్నఁబడెను.

అనేక శతాబ్దములనుండి నాగరికులచే వ్యవహరింపఁబడి మంచి సాహిత్యమును సమకూర్చుకొనిన భారతదేశ భాషలు పాఠశాలలయందు బోధనా సాధనములుగ నుపయోగపడవనుట నమ్మరాని విషయము. కొన్ని రాజకీయ కారణములచే నీభాషలు ముఖ్యములగు వ్యవహారములయందుపయోగింపఁ బడక పోవుటయు నా నిరాదరణ వలన నవి కొన్ని విషయములయందసమగ్రముగా నుండుటయు జరిగినది. తగిన యాదరణము నిచ్చినచో మాతృభాషలయందును దగిన పారిభాషిక పదజాల మేర్పడును. ఏభాషయైనను మొట్టమొదటనే సమగ్రముగా నుండదుగదా. ఒక పెద్ద ప్రవా

హాముననందితరములగు చిన్న చిన్న ప్రవాహాములు కలియునట్లు ప్రతి భాష యందు నితర భాషల యొక్కలి పదజాలము కొద్దిగనో గొప్పగనో కలియక తప్పదు. ఆ భాషయందే క్రొత్తపదములను సృష్టించుకొనుటయు జరుగుచుండును. ఈవిధముగ భాష పరిపుష్టమగుచుండను.

మాతృభాష ఉగ్గుతోఁ బెట్టినది కావున నా భాషయందు విషయములను బోధించుట మిక్కిలి సులువుగానుండను. బాలుర మనస్సులు గూడ విషయమును గ్రహించుటయందు మిక్కిలి యుల్లాసము కలిగియుండను. అందుచేత బోధకునికే గాక బోధితునకుఁగూడ పని తేలిక యగును. వారికి విద్యాబోధనము వీరికివిద్యాగ్రహణమును క్రీడవలెనుండును. పరభాషయందు విద్యను బోధించుటకుగాని, గ్రహించుటకుఁగాని పట్టు కాలములో మాతృ భాషయందే యాపనులఁజేయుటకుఁ బట్టు కాలమెంత భిన్నము మాత్రమే యగును.

ఇతర భాషను బోధనా సాధనముగ నుపయోగించుటవలన బాలుర యందు "శుకానువాద ప్రవృత్తి" యేర్పడుచున్నది. ఆభాషయందు భావ గ్రహణ శక్తియు వ్యక్తీకరణ శక్తియు బాలురకేర్పడి యుండక పోవుటచే వారి కర్థము కానిదానిని గూడఁ గంఠస్థము చేయవలసిన పరిస్థితి యేర్పడు చున్నది. "అర్థముకాని చదువు వ్యర్థముకదా". ఇట్టి శుకానువాదముచేత బాలుర జ్ఞాపకశక్తి కనవసరముగ క్లేశము కలుగుటయే గాని మానసిక శక్తు లేవియు నభివృద్ధిఁ జెందవు.

బాలురకుఁ బరిచితముగాని యన్యభాష యతఁడు గ్రహింపవలసిన యంశములను సులభముగ గ్రహింపనీయక యొక ప్రతిబంధకముగా నేర్పడు చున్నది. ఒకే యంశము మాతృభాషలో బోధింపఁ బడినపుడర్థము జేసికొని నంత సులభముగాఁ బరభాషలోఁ బోధింపఁబడినపుడు బాలుఁడర్థము చేసి కొనఁ జాలఁడు. కావున మాతృభాషయందే విద్యాబోధన జరుగవలసినట్లు స్పష్టమగుచున్నది.

# 7

# భాషయొక్క వ్యాపారములు

మనమొక భాషను నేర్చుకొనినామన్న నా భాషయందితరులు వెల్లడించునట్టి భావములను మనము గ్రహింపఁగలమనియు నా భాష యందు స్పష్టముగను, నిర్దుష్టముగను మన భావములను వెల్లడింపఁగలమనియు నర్థము. మొదటి దానిని భావగ్రహణ మనియు, రెండవదానిని భావ వ్యక్తీకరణ మనియు నందురు.

భావగ్రహణము రెండు విధములుగా జరుగుచున్నది. ఇతరులు చెప్పు విషయములను వినుటమూలమునఁ గొన్ని భావములను మనము గ్రహించుచున్నాము. బడులయందుపాధ్యాయులు చెప్పు విషయములను, సభలయందలి యుపన్యాసములను, వాదప్రతివాదములను, హరికథలను, పురాణములను, బుఱ్ఱకథలను, సంభాషణములను వినుటవలన మనమితరుల భావములను గ్రహించుచున్నాము. ఇదియొక విధమగు భావగ్రహణము. ఇతరుల చేత గ్రంథస్థములుగాఁ జేయఁబడిన గద్య గ్రంథములనేమి, పద్య గ్రంథములనేమి కొన్నిటిని నిశితముగాఁ జదువుట వలనను గొన్నిటిని సామాన్యముగాఁ జదువుట వలనను గూడ మనమితరుల భావములను గ్రహింపఁ గలుగుచున్నాము. ఇది మరొక విధమగు భావగ్రహణము.

అట్లే భావ వ్యక్తీకరణము గూడ రెండు విధములుగా నున్నది. వాఙ్మూలమున నితరులకుఁ దన యభిప్రాయముల వెల్లడించుట యొకటి. మన ముపన్యసించుటచేతనేమి, సంభాషించుటచేతనేమి, వాదించుటచేతనేమి, కథలు చెప్పుటచేతనేమి, యభినయగీతముల మూలముననేమి, యితరులకు మన యభిప్రాయములను దెలియఁ జేయుట యీ తెగకుఁ జెందినది. ఇఁక లిఖిత మూలమున మన యభిప్రాయముల నితరులకుఁ దెలియఁజేయుట రెండవది. జాబుల మూలముననను, రచనల మూలముననను (వ్యాసములనుగాని, గ్రంథములనుగాని) మన యభిప్రాయముల నితరులకు వెల్లడించుట యీ తెగకుఁ జెందినది.



భాషా వ్యాపారములు
భావగ్రహణము
భావ వ్యక్తీకరణము
వినుట
చదువుట
ఉపన్యాసములు మొ॥
బడియందలి విద్యా బోధన
నిశిత పఠనము
విస్తృత పఠనము
ఉక్తము
లిఖితము
ఉపన్యాసములు మొ॥
సంభాషణ
కథలు మొ॥
జాబులు
వ్యాసములు
గ్రంథములు

# క్రీడాపద్ధతి



బాలుర మనస్సు సామాన్యముగా నాటలపైననే యుండును ఆట యనునది కూడ నొక పనియేయైనను దాని యందు బాలురకంత యుత్సాహముండుటకుఁ గారణమేమో విచారింతము పనియనునదేదేనొక ప్రయోజనమును గోరి ఇతరుల నిర్బంధముపైఁ జేయు కార్యము తనకుఁ దానుగాఁ జేయఁ దలఁచుకొనిన పనిని జేయుటయందుఁ జూపు నుత్సాహము నెవ్వరైన నితరులు జెప్పుపనిని జేయుటయందుఁ జూపరుగదా కావున నాట యనునది స్వేచ్ఛగాఁ జేయునదియై యుండఁ బనియనునది పరేచ్ఛ ప్రకారము జేయునదియై యున్నది మీఁదు మిక్కిలి యాటయందుఁ బ్రయోజనముపైఁ గాక యాటపైనే బాలురకు మక్కువ యుండును అనఁగా జయాపజయములపైఁ గాక బాలుని మనస్సు ఆటపైనే లగ్నమై యుండును. గెలిచినవాఁడును, ఓడినవాఁడును సమానముగనే ఆట వలని యానందమును బొందుచున్నారు. పని యందట్లుగాక యాపని నెఱవేఱినపుడే యానందముగల్గుటయు నెఱవేఱనపుడు నిరుత్సాహపడుటయుమనముజూచుచున్నాము. కావున విద్యాబోధన యందుపాధ్యాయుఁడు జాగ్రత్తవహించి బాలురకు విద్య నేర్చుకొనుట యొక క్రీడగాఁగన్పట్టునట్లును, పని యని యనిపించనట్లును జేసినచో బాలురకు విసుగు పుట్ట

కుండును అందుచేతఁ గ్రీడాపద్ధతి నవలంబించుట యుపాధ్యాయుని కర్తవ్యము

మన స్తత్వ శాస్త్రము ప్రకారము వయోజనులయందుకన్నను బాలురయందు విసుగుదల శీఘ్రముగా జనించును అందుచేతఁ బ్రాథమిక దశయందే పాఠ్యమును బోధించవలసిన క్రీడాపద్ధతివలెఁ బ్రయోజనకారియగునది మరొకటిలేదు నేటి విద్యావేత్తలెల్లరును విద్యాబోధన యంతయుఁ గ్రీడారూపముననే సాగవలయునని చెప్పుచున్నారు మాతృభాషాభ్యసనము విద్యార్జనమునఁ బ్రథమ సోపానము గావున నియ్యెడఁగూడఁ గ్రీడా పద్ధతియే యవలంబించఁ దగినది.

ఈపద్ధతి నవలంబించుట వలనఁ గలుగు లాభములను గమనింతము చదువు నేర్చుకొనుటొక పనిగాఁ గాక క్రీడగానుండుటచేత బాలురకుఁ జదువునెడల విముఖత గలుగకుండుటయే గాక చదువుకొనవలెననెడి యుత్సాహ మతిశయించును ఉత్సాహవంతముగాఁ జేయుపని యెప్పటికిని జయప్రదముగా జరుగుటయుఁ గొలది కాలములోనే నెఱవేఱుటయును మనకుఁ దెలియును అందుచేత శీఘ్రకాలములోనే బాలురు చదువు నేర్చుకొనఁ గలుగుదురు బాలుని యాత్మీయత విశ్వాసమును బొందును క్రీడయందు బాలుఁడు తానొక సంఘసభ్యుఁడుగా వ్యవహరించవలసి వచ్చుటచేత బాలురయందు సంఘీభావము పెంపొందును ఈపద్ధతి ప్రాథమిక దశయందు ముఖ్యముగా నవలంబించఁ బడుటచే బాలురకుఁ బఠన లేఖనము లధికాయాసము లేకయే సులభ లభ్యము లగును.

ఎంత యుత్తమ పద్ధతి యైనను నిది యన్ని విషయములను బోధించుటకును నన్నివేళల నవలంబించుటకును దగినది కాదని గమనించుట ముఖ్యము ఎక్కములు వల్లెవేయించుట వంటి క్రమశిక్షణతోడి యభ్యాసములఁ జేయించునపుడు క్రీడాపద్ధతి యుపయుక్తముగాదు కావున నిది యొక స్వయంసంపూర్ణమైన పద్ధతి యని కాక విద్యాభిరుచిని బాలురకుఁ గల్గించుటకొక మార్గమని గమనించవలెను క్రీడయనెడి భావము నూతన విషయములను గ్రహించుట యందెట్లో పాఠశాల యందలి జీవితమును భావి పౌరజీవితము నానందముగాఁ గడపుటయందు నట్లె ప్రయోజనకారి ఈభావమే మనస్సున లేనియెడల మానవుని జీవిత మానందమయము గానేరదు జీవితమును గ్రీడఁగాఁ జూడవలెనన్నచో జీవితమందలి సర్వావస్థలయందును, జీవిత పరమార్థమునందును దృణీకారము వహించుట యని తలఁచుట తప్పు ఏసమయమందైనను సంతోషము గలిగియుండవలెననియు, నే పనిని జక్కఁబెట్టుకొనునపుడు నాటలయందుఁ బాల్గొనునంత యుత్సాహమునే గనఁబఱుచుటవసరమనియు నట్టమనఃప్రవృత్తిని బెంపొందించుకొనవలెననియుఁ దలఁపవలెను.

పఠనమును బోధించుటకుఁ దగిన క్రీడా మార్గములు కొన్ని యీ క్రిందఁ జెప్పఁబడుచున్నవి మెఱపుటట్టల నుపయోగించుట యొకటి ఈ యట్టలను మూఁడు విధములుగా సిద్ధము చేయవచ్చును బొమ్మయు, దానిక్రిందఁ బేరును అట్టకొక వైపుననే యుండునట్లు తయారు చేయవచ్చును. అట్ట

కొక వైపునఁబొమ్మయు, మరొక వైపునఁ బేరును నుండు నట్లును సిద్ధము చేయవచ్చును ఒక యట్టపైఁ బేరును మరొక యట్టపైఁ బొమ్మయు నుండునట్లును సిద్ధము చేయవచ్చును. మొదట బాలునకు బొమ్మను జూపి వానిచే దాని పేరుఁ జెప్పించి తర్వాత నా బొమ్మ పేరును జూపి యందలి యక్షర ములను జదివించవచ్చును. క్రమముగా బాలుఁ డక్షరము లను గుర్తించఁగలుగుటయు బొమ్మ సహాయము లేకయే యా యక్షరములు గల పేర్లను జదువఁ గల్గుటయు నేర్పవచ్చును

సెలవు దినములను దెలియఁజేయునట్టియు, బాలురాడ వలసిన యాటలను గూర్చి తెలియ జేయునట్టియు పటములను— పెద్ద యక్షరములతో వ్రాయఁబడినవానిని—తరగతి గదుల గోడలకుఁ దగిలించవచ్చును సెలవులపైనను, నాటలపైనను బాలురకుఁగల ప్రీతిచేతఁ దమకుఁ దామే వానిని జదువఁబూను కొని యందలి యక్షరములను దెలిసికొనుటకుఁ గృషి చేయుదురు

బడి తోట యందున్న చెట్లకును వస్తు ప్రదర్శనశాల యందున్న వస్తువులకును వానివాని పేర్లను సూచించునట్టి పట్టిలను దగిలించవచ్చును

పై విధమునఁ జదివించునపుడు తరగతిని రెండు భాగ ములుగ విభజించి ఏవర్గమువారు బాగుగఁ జదువుదురో వారు గెలిచినట్లు నిర్ణయించవచ్చును వాచకమునుజదువునపుడుగూడ నిట్టే పందెములు బెట్టవచ్చును. ఇట్టి పందెములయం దొకరి నొకరు మించవలయు ననెడి యుత్సాహముతో బాలురు చక్కగాఁ జదువుటకు నేర్చుకొందురు.

లేఖనమును బోధించునపుడు గూడ నిట్లే కొన్ని క్రీడా మార్గము లవలంబించ దగును అక్షరములను దిద్దుకొనుట యందు బాలుర కభిరుచి యుండదు అందుచేత నక్షరముల యాకారములను గింజలతోను, పూసలతోను, రంగుదారముల తోను బాలురు నిర్మించునట్లు చేయవచ్చును. బాలురకది యొక యాటగా నుండి వ్రాతను సులభముగా నేర్చుకొందురు

కొన్ని బొమ్మలను వాని పేర్లను వేర్వేరుగా నిచ్చి యే బొమ్మక్రింద నాపేరును బాలురచేత వ్రాయించవచ్చును అట్లే వస్తు ప్రదర్శనశాల యందలి వస్తువుల పేర్లను వ్రాయుట కని బాలుర కభ్యాసము సేయవచ్చును

బాలురు పఠన లేఖనములను నేర్చుకొనిన తరువాత నవలంబించదగు క్రీడలు కొన్ని యీ క్రింద బొందు పఱుచ బడుచున్నవి బాలురకు బొడుపు కథలు జెప్పి వారు వానిని విప్పునట్లు చేయవచ్చును. బాలురు వారిలో వారే కథలు వేసికొని విప్పునట్లు చేయవచ్చును.

వాక్యము నందలి పదములను దారుమారుచేసి వానిని సరియగు క్రమములో నుంచవలసినదిగా బాలురను గోర వచ్చును ఉదా — (1) దశరథుని, రాముడు, కుమారుడు. (11) మంచి, ఉన్నది, ఒక, నాకు, పుస్తకము (111) దేశము లోని, మన, నదులలో, పవిత్రమైనది, మిక్కిలి, గంగానది.

కొన్ని వాక్యముల యందలి కర్తలను, కర్మలను, క్రియలనిచ్చి యామాటలతో వీలయినన్ని వాక్యములను రచించ వలసినదిగా బాలురను గోరవచ్చును. ఉదా:— (1) సూర్యుడు,

చంద్రుఁడు, ఉదయించును, వెన్నెల, ఎండ, అస్తమించును, కాయును, పడమట, తూర్పున (ii) నేను, నీవు, వాఁడు, తాళము, పాట, ఆట, పాడితిని, వేసెను, ఆడితివి

బాలురకుఁ గథలను జెప్పిన తర్వాత వారిచేత నా యంశములనే నాటకములుగా నాడించవచ్చును. వారి సొంత భాషలో నభిప్రాయములను వెల్లడి చేయనీయ వచ్చును

సామెతలు మొదలగు లోకోక్తుల నొకటి రెండు పదముల లోపముతో నల్లబల్లపై వ్రాసి వాని బాలురు పూరించునట్లు చేయవచ్చును. ఉదా— (i) నీరు,— , ఎఱుఁగు, నిజము,—— , ఎఱుఁగు (ii) దాసరి,——, పెరుమాళ్ళకు,——. (iii) ఎవఁడు, ——, గోతిలో,——, పడును

కొన్ని సామెతలను దప్పుగా వ్రాసి వానిని బాలుర చేత దిద్దించవచ్చును ఉదా — తాను పట్టిన కుందేటికి రెండే కాళ్ళు

కొన్ని నామవాచకములను వాని విశేషణముల నొక దాని కొకటి యెదురుగా లేకుండునట్లిచ్చి వానిని జత చేయ వలసినదిగా బాలురను గోరవచ్చును.

ఉదా — శకుని————బలవంతుఁడు.
కర్ణుఁడు———దేవతల రాజు.
భీముఁడు———మోసగాఁడు
ఇంద్రుఁడు—గొప్పదాత.

అట్లే వాక్యముల పూర్వ భాగములను పరభాగముల నొకటికొకటిసంబంధము లేనట్లిచ్చి వానినిజత చేయించవచ్చును.

పద్యము నందలి పంక్తులను క్రమము దప్పించి యిచ్చియుఁ, నందలి పదములఁగూడఁ దారుమారు చేసి యిచ్చియుఁ బద్యమును బాలురచేత సరిగా వ్రాయించవచ్చును

## ఎత్తుగడ పద్ధతి

పూర్వమునుండి పాఠశాలలలో విద్య నేర్పఁబడుచునే యుండెడిది కాని బడివిడిచిన తర్వాత నిత్యజీవనములో నా విద్య నిరుపయోగముగా నుండెడిది నిత్య జీవనములో నుప యోగపడని విద్య ప్రయోజనకారి కాదని విద్యావేత్త లెల్లరు నిటీవల గ్రహించిరి అందుచేతఁ బాఠశాలయందుఁ బోధించు విషయములకును జీవిత విషయములకు నన్యోన్య సంబంధ మేర్పఱుచుటకై కన్గొనఁబడిన పద్ధతియే యెత్తుగడ పద్ధతి

ఇతర పాఠ్యాంశములను బోధించునపుడే కాక మాతృ భాషా బోధన యందుఁగూడ నీపద్ధతి యనుసరణీయముగనే యుండును బాలురు నేర్చుకొనవలసిన విషయము నెడల వారి కభిరుచి గల్పించుటకును వారు చేయుపని కొక యుద్దేశమును గల్పించుటకు నీపద్ధతి మిక్కిలి ప్రయోజనకారి బాలుర యవస రములను గమనించి యేదే నొక కార్యమును బ్రారంభించు టయు, దాని నాధారముగఁ జేసికొని యన్ని పాఠ్యాంశము లను సమన్వయపఱిచి బోధించుటయు, పాఠశాలయందు బాలురు చేయు కృషియందు వాస్తవికత నారోపించుట మూలమున వారికి నిజమైన యభిరుచిఁ గల్గించుటయు, విద్యా ర్జన సులభతరముగ సహజముగ నుండునట్లు జేయుటయు, నీ

పద్ధతి నవలంబించుట వలని ప్రయోజనములు కొంచెము సంక్షిప్తముగా విమర్శించినచో నిది బోధనాతత్త్వమును నిరూపించునదై బాల ప్రణాళికను నిర్ణయించుట కుపయోగపడునట్టి యొకానొక సాధనమనియు, బోధనకు సంబంధించిన యొక పద్ధతి కాదనియుఁ దోఁచును

ఈపద్ధతి జయప్రదము గావలెనన్న నుపాధ్యాయుఁడు కొన్ని విషయములను జ్ఞప్తియందుంచుకొనవలెను ఉపాధ్యాయుఁడు తానుగా నేదేని యెత్తుగడను లేక యుద్యమమును నిర్ణయించరాదు బాలురందఱును గలిసి తమ యావసరములఁ దీర్చుకొనుటకై యొక యెత్తుగడను దామే నిర్ణయించుకొనవలెను. వారట్లు తమలోఁదాము చర్చించుకొని యొక నిర్ణయమునకు వచ్చి యీ యెత్తుగడను బ్రారంభించుటకు కొన్ని దినములు పట్టవచ్చును వారు చర్చించునపు డుపాధ్యాయుఁడు గూడ వారిలో నొకఁడుగా నుండి యేవేని సూచనలు చేయవచ్చును తన నిర్ణయమును వారంగీకరించునట్లు చేయుట యందుఁ బట్టుదల గలవాఁడుగా నుండక వారే యొక నిర్ణయమునకు వచ్చుటకుఁ దోడ్పడవలెను

ప్రారంభించవలసిన యుద్యమము నీవిధముగ నిర్ణయించుకొనిన పిదప దానిని సరిగా నెఱవేర్చుటకు సంబంధించిన యనేకవిషయములను దెలిసికొనుటకు బాలురు ప్రయత్నము చేయవలసి యున్నది. ఇట్లు ప్రయత్నము చేయుటలో బాలురనేక పుస్తకములను, పత్రికలను జదువవలసి వచ్చును. అందువలన బాలురకుఁ బఠనమునందుఁ బ్రత్యేకముగ నభి

రుచిఁ గల్గించవలసిన యవసర ముపాధ్యాయున కుండదు. బాలురకుఁ దమంతఁ దమకే యభిరుచి యేర్పడును ఉద్యమము సాగుచున్నపుడు గూడ నుపాధ్యాయుఁడు చెప్పకయే బాలురా యావిషయములను గ్రహించుటకుఁ గావలసిన పుస్తకముల కై త్వరపడుచుందురు పఠనౌత్సుక్యమునకు వేఱు దోహదముఁ గల్పింప వలసిన పనిలేదు వారి పఠనాభిలాషకుఁ దగిన పుస్తకములను సేకరించి వారికిచ్చుటయే యుపాధ్యాయునకుఁ గష్ట సాధ్యముగ నేర్పడవచ్చును.

మాతృభాషను బోధించుటకన్ని యుద్యమములందు నవకాశము కలదు ఎత్తుగడ నెన్నుకొనుటలో బాలురు తమలోఁదాము సాధ్యా సాధ్యములను అవసరానవసరములను జర్చింతురు. ఇట్టి చర్చల నుపాధ్యాయుఁడు ప్రోత్సహించ వలెను ఈవిధముగా నీపద్ధతియందు వాచిక చర్యకు మంచి యవకాశ మేర్పడుచున్నది.

ఎత్తుగడను నిర్వహించునపుడు బాలురు తాము చేయు కార్యముల నేనాటి కానాఁడు విపులముగ నొక చిన్న వ్రాత పుస్తకమునందు వ్రాయుదురు. వాని నుపాధ్యాయుఁడు దిద్దిన తరువాత బాలురు వానినిఁ దమ యుద్యమ పుస్తకమునందు వ్రాసి యుంచుకొందురు. ఈ విధముగా లిఖిత రచనకు నవకాశము గలదు

వ్రాయుటకు ముందే వ్రాయవలసిన యంశములను గూర్చి బాలురు సంభాషించునట్లు వారినిఁ బ్రోత్సహించుట మూలమున నుత్తరచనకు వీలు గలుగఁ జేయవచ్చును.

ఉద్యమమును ప్రారంభించుటకుఁ బూర్వమును, నిర్వహించునపుడును, బాలురకుఁ గావలసిన వస్తువులును పుస్తకములును గొన్ని యుండును. అవి బడియందే యున్నచోఁ ప్రధానోపాధ్యాయుని యనుమతి యవసరమగును. ఇతర చోట్లనుండి తీసికొని రావలసినవిగా నున్నచో నవి యెవరి యధీనమందున్నవో వారి యనుమతి గావలసి వచ్చును అందుకై తత్సంబంధులగు వ్యక్తులకు ననుమతికొఱకు విజ్ఞాపన చేయుచు లేఖలు వ్రాయవలసిన యవసర మేర్పడుచున్నది ఇట్టి లేఖలను దరగతియందలి బాలురందఱిచేతను వ్రాయించ వచ్చును లేఖారచనమునకిదియే యుద్దేశకల్పనముగానుండును ఇట్లు వ్రాయఁ బడిన లేఖలలో శ్రేష్ఠములగు వానినేరి యుపాధ్యాయుఁడు పంపవచ్చును

కావున నీవిధానము ప్రతి విద్యార్థిని శక్తివంచన లేక కృషి చేయునట్లు ప్రోత్సహించునదిగా యున్నది ఎంత కాలములోఁ బూర్తి చేయఁదగు నెత్తుగడలను గ్రహించవలె నను విషయము నిఁకఁ బరిశీలింతము కొన్ని యెత్తుగడ లొక సంవత్సర కాలములోఁ గాని పూర్తి కానివిగా నుండవచ్చును కొన్ని కొలది నెలలలో ముగియునట్టివిగా నుండవచ్చును. కొన్ని కొలది వారములలోనే ముగియునవి కావచ్చును కొన్ని యెత్తుగడ లనేక పాఠ్యాంశములను బోధించుటకు వీలుగా నుండవచ్చును. కొన్ని కొన్ని పాఠ్యాంశములను మాత్రమే బోధించుటకు వీలుగ నుండవచ్చును బాలురెత్తు గడల నెన్నుకొనునపుడు సుమారు రెండు మూఁడు నెలలు

పట్టునవియును, సాధ్యమైనన్ని యెక్కువ పాఠ్యాంశములను నేర్చుకొనుటకు వీలయి నట్టివియును నగు వాని నుపాధ్యాయుఁడు సూచించఁదగును కాని వానినే నిర్వహించుటకు నిర్ణయించున ట్లుపాధ్యాయుఁడు బాలురను నిర్బంధము చేయరాదు ఏది యవసరమని బాలురు తలఁచెదరో, దేనియందు వారికుత్సాహముండునో యది పై నిబంధనలకు లోఁబడి యుండకపోయినను దానినే వారు స్వీకరించునట్లు చూడవలెను. ఏ యెత్తుగడయందైనను బోధించుటకు వీలులేక మిగిలిపోయిన పాఠ్యాంశముల నుపాధ్యాయుఁడు సాధారణ పద్ధతిని బోధించవచ్చును,

కావున నీయెత్తుగడ పద్ధతి యేయొక్క పాఠ్యాంశమును గాని బోధించుట కేర్పడినది కాదనియును, జ్ఞానార్జన కవసరమును గల్పించి, బాలుర యుత్సాహమునకుఁ బ్రోదిచేసి పాఠములను సులభముగా బోధించుట కేర్పాటు చేయఁబడిన విధాన మనియును గ్రహించవలెను దీనిని బట్టి మాతృభాషకు నిత్యజీవితమందున్న ప్రాముఖ్యమును, దానికిఁ బాఠశాల యందీయవలసిన స్థానమును స్పష్టమగుచున్నది తపాలా కార్యాలయమును నడుపుటయు, చిన్నగృహమును నిర్మించుటయు, ఉద్యానవనమును పెంచుటయు, అంగడి నడుపుటయు, గ్రామపటమును సిద్ధము చేయుటయు, ఆటస్థలమునుసిద్ధము చేయుటయు నెత్తుగడలలోఁ గొన్ని

# నాటక పద్ధతి

నాటకమనఁగా నాట్యముగలది నాట్యమనగా నవస్థ ననుకరించుట. వివిధములైన సన్నివేశముల ననుకరించుటయే నాట్యము సహజాతములే కాక బాలురయందుఁ గొన్ని సహజ ప్రవృత్తులు గూడఁ గలవు అనుకరణమనునది యట్టి వానిలో నొకటి. అనుకరణము మూలముననే వస్త్రోచ్చార ణాదికములను నేర్చుకొనుట జరుగుచున్నది ఊరిలో నే సినిమా వేయఁబడుచున్నపు డాసినిమా యందలి పాటలందరి నోళ్ళనుండియు వినవచ్చుచుండుటను మనము చూచు చున్నాము బాలురయందుఁ గల యీ ప్రవృత్తినాధారముగఁ జేసికొని వారికి బోధించఁబడు విషయమునం దభిరుచిగలిగిం చుటకే నాటకీకరణ ముద్దేశించ బడినది బోధించఁ దలఁచు కొనిన విషయమును నాటక రూపముగ మార్చి బాలురచేతఁ బ్రదర్శింపఁజేయుటయే నాటకీకరణము అన్ని పాఠములను నాటకములుగా మార్చుటకు వీలుండదు. కథనముగల పాఠ ములు మాత్ర ముపయోగపడును

ఉపాధ్యాయుఁడు తానుగా వ్రాసిన నాటకమును గాని యితరులు వ్రాసిన నాటకమునుగాని యుపయోగించుట యొక పద్ధతి. అట్లుగాక విద్యార్థులనే సమయము వచ్చినట్లు మాటాడవలసినదిగా కోరుట మఱియొక పద్ధతి

మొదటి పద్ధతి బాలురకుఁ గొంత శ్రమను దగ్గించును. వారు సహజముగా నభినయించుట యందుఁ దమ మనస్సును

లగ్నము చేసినఁ జాలును సంభాషణలను గూడ నాలోచించు కొన వలసిన శ్రమ తొలఁగిపోవును తాముగా నప్పటికప్పుడు సంభాషణలను సిద్ధము చేసికొనుట చిన్న తరగతులలోని బాలురకు పూర్తిగా నసాధ్యమైన పని ఇతరులు వ్రాసిన నాటకములలోఁ బద్యములును పాటలు నుండుట తటస్థించును బాలురకివి మిక్కిలి యుత్సాహమును గలిగించును ఇఁక నిందలి లోపములను జూతము బాలురు నాటకములను ప్రదర్శించుటకుఁ బూర్వము తమ తమ పాత్రలకుఁ దగిన సంభాషణములను బద్యములను పాటలను గంఠస్థము జేయవలసియుండును అది చిన్నతరగతుల బాలురకు శ్రమను గల్గింపవచ్చును ఇతరులు చెప్పినవానినే పలుకుట కలవడిన బాలురకు స్వతంత్ర రచనాశక్తి వృద్ధియగుట కవకాశముండదు అందుచేత వాచికచర్యయొక్క యుద్దేశము నెఱవేఱక పోవుచున్నది

రెండవ పద్ధతి నవలంబించుట వలన బాలుర యొక్క ఊహాశక్తి పెంపొందును. వారూహించి చెప్పు మాటలకుఁ దగినట్లుగ వారభినయించుట మిక్కిలి సహజముగ నుండును. బాలురకు వాచిక చర్యయందు మంచి యభ్యాసముగలుగును. మొదటిపద్ధతి యందుఁ జెప్పిన యితర లాభములు దీని యందు లేవు.

ఈ రెండు విధములైన నాటకములను గూడ బాలుర వయస్సును బట్టియు శక్తిని బట్టియుఁ బ్రదర్శించుట మంచిది.

నాటకము లాడించునపు డుపాధ్యాయుఁడు కొన్ని

యశములను గమనించవలెను సక్రమముగాఁ శోపమును
బోధించిన పిదపనే నాటకీకరణము జరుగవలెను బాలుర
యొక్క శక్తిసామర్థ్యముల నభిరుచులనుబట్టి పాత్రనిర్ణయము
జరుగవలెను సంభాషణలయందర్థము చెడనట్లు బాలురు తమ
సొంత వాక్యములనుగాని పదములను గాని యుపయోగించ
వచ్చును ఈ విషయమున నవసరమైనచో నుపాధ్యాయుఁడు
వారికి సహాయము చేయవచ్చును కాని యుపయోగించఁబడు
భాష సహజముగను పాత్రోచితముగ నుండవలెను.
బాలురు వేషములను ధరించవలసిన పనిలేదు తరగతిని కొన్ని
వర్గములుగా విభజించి యొక వర్గము వారు నాటకమును
ప్రదర్శించునపుడు మిగిలిన వారందరు లోపములను గమనించు
నట్లుచేసి యాలోపములు లేకుండఁ బ్రదర్శింపుఁడని మరొక
వర్గము వారిని కోరవచ్చును బహిరంగ ప్రదర్శనము కాదు
కావున లోపముల నంతగా గమనించరాదు ఆరితేరిన నటుల
వలె బాలురు నటనఁ జేయలేకున్నను సహజముగ వచ్చు
కొలది యభినయముఁ జేయఁగల్గినఁ జాలును ఆంగికాభి
నయము కన్నను వాచికాభినయమునకుఁ బ్రాధాన్యము నీయ
వలెను. దీనివలని ప్రయోజనములను గూర్చి కొంత ముచ్చ
టించితిమి బాలురకిది యొక క్రీడవలె నుండును. కావున వారు
దీనియం దుత్సాహముతోఁ బాల్గొందురు. మానవుఁడు
సంపాదించుకొను జ్ఞానమునకంతకును మూల కారణములు
కన్నులు, చెవులు ఈ రెండిటిలో నేయొకదాని మూలమున
సంపాదించుకొను జ్ఞానముకన్నను రెండిటి సహాయమున నేర్చు

కొను జ్ఞానము బాగుగా మనసున హత్తుకొనును నాటక పద్ధతి మూలమున నిల్లు జరుగుచున్నది వాచిక చర్యయందు బాలురకు మంచి యభ్యాసము గలుగుట కిది సహాయపడుచున్నది నిత్య జీవనములో మనము మాటలాడుటయందే యెక్కువ కాలమును గడుపుచున్నాము నాటకముల సందర్భమున బాలుర కలవడిన వాచికాభినయము బాలురను చక్కగా మాటలాడఁగల వారినిగాఁ జేయును బాలురయందు కళాభిరుచియేర్పడుట కిది మిక్కిలి సహాయకారి బాలురయందు సహజముగానున్నట్టి యనుకరణ యనెడి సహజ ప్రవృత్తి కిది దోహదమును గల్గించును. సభాకంపమును బోగొట్టుటకిది సహాయపడును. సాముదాయిక కృషి యందు బాలుర కనుభవము గలిగి వారు సాంఘిక జీవనులగుటకుఁదోడ్పడును ముమ్ముందు బాలురలోఁ గొందఱు మంచి నటకు లగుటకును నాటకీకరణము సహాయ పడును.

## వ్యక్తి పద్ధతి

నేఁడు సామాన్యముగా బడుల యందవలంబించఁ బడునది సమష్టి బోధనా విధానము ఒకే తరగతియందుఁ గల విద్యార్థులకు— సుమారు నలుబది మందికి— ఉపాధ్యాయుఁడు సమష్టిగాఁ బాఠమును బోధించును ఆ తరగతియందున్న వారిలోఁ గొలది మంది మిక్కిలి చుఱుకైనవారుగ నుండవచ్చును. మఱొక కొలదిమంది మందబుద్ధులుగానుండవచ్చును. మిగిలినవారు సామాన్యులుగ నుందురు ఉపాధ్యాయుఁడు

బోధించు విషయములన్నిఁ దాము గ్రహించఁగలిగి యధికముగా నుండుటచేతఁ జుఱుకైనవారు తమ తెలివి కొలఁది ముందునకుఁ బోవుటకవకాశముండదు మందబుద్ధులుపాధ్యాయుని బోధన యయోమయముగ నుండుట తటస్థించును. అందుచేతఁ దరగతియందున్న సామాన్యులకు మాత్రమే యుపాధ్యాయుని బోధనలుపయోగపడును కావున సమష్టి బోధనయందున్న వైలోపమును సవరించి ప్రతి విద్యార్థియు బోధనవలన వీలయినంత యుపయోగమును బొందవలెననెడి యుద్దేశముతో నేర్పాటు చేయబడిన పద్ధతియే వ్యష్టిపద్ధతి. ఈ పద్ధతి మొట్టమొదట నమెరికా దేశమందు 'డాల్ట' నను చోట నొక యుపాధ్యాయుచే నాచరించఁ బడినదగుటచే దీనికే డాల్టను విధానమనియుఁ బేరు గలదు

ఒక్కొక్క బాలునికిని బ్రత్యేకముగా బోధించవలెనన్న నుపాధ్యాయులసంఖ్య బాలుర సంఖ్యకు సమానముగా నుండవలెను అది యాచరణ సాధ్యముగానిపని ఒకేయుపాధ్యాయుఁడు సమష్టిగా నేఁడు బోధించుచున్నంత మందికి వ్యష్టిగా బోధించుటకుఁ బూనుకొనెనా యతఁడలవిగాని పనికిఁ బూనుకొనెనన్నమాట కావున నీబాధకమును దొలఁగించుటకై వ్యష్టివిధానము నాచరించు సందర్భమున నియోజనముల నుపయోగించవలసిన యవసరమేర్పడినది.

ఈ నియోజనముల (assignments) నేర్పాటు చేయునపుఁ డుపాధ్యాయుఁడు తరగతియందలి విద్యార్థులందఱకు నొకే నియోజనము నీయవలసిన పనిలేదు. వారివారి తెలివి

తేటలనుబట్టియుఁ బూర్వజ్ఞానమును బట్టియుఁ జేయఁగల పరిశ్రమనుబట్టియుఁ దరగతిని రెండుమూఁడు వర్గములుగా విభజించి యొక్కొకవర్గమువారి కొక్కొక నియోజనము నీయవచ్చును అట్లు చేసినచోఁ దరగతియందలి సమష్టి బోధనకు సంబంధించిన లోపములు దొలఁగును వేఱువేఱు నియోజనములన వేఱు వేఱు విషయములకు సంబంధించినవిగానే యుండవలసిన పనిలేదు ఒకేవిషయముపై వేర్వేఱు శ్రేణులకుఁ జెందిననియోజనములనీయవచ్చును మందబుద్ధులుగానుండువారికి సులభమైన ప్రశ్నలతోఁగూడిన నియోజనముల నీయఁదగును సామాన్యులకు కొంత కఠినములగు ప్రశ్నలతోఁ గూడిన నియోజనములనీఁదగును కుశాగ్ర బుద్ధులకింకను గఠిన ప్రశ్నలతోఁగూడిన నియోజనములను సిద్ధము చేయవచ్చును.

ఈ విధమున నియోజనముల మూలమున బాలురెవరికి వారే కృషిచేయుచున్నను నుపాధ్యాయు డప్పుడప్పుడును దరగతిని సమావేశము చేసి సమష్టిగా నేవేనిఁ గొన్ని విషయములను బోధించవచ్చును ఒక పాఠ్యమునకు వారమునకు నాలుగైదు గంటలకాలము నియమితమై యున్నచో నందొక గంటకాలము సమష్టిబోధనకు వినియోగించవచ్చును మాతృభాషాబోధనయందిది మిగుల నవసరము లేనిచో వాచికచర్య యడుగునఁ బడును.

నియోజనమునందలి ప్రశ్నలకును బరీక్షాపత్రమునందలి ప్రశ్నలకును భేదముగలదు పరీక్షాపత్రమునందలి ప్రశ్నలు కేవలము విద్యార్థియొక్క పూర్వజ్ఞానమును బరీక్షించునవిగ

నుండును. అట్టి ప్రశ్నల సముదాయము నియోజన మనిపించుకొనదు నియోజనమునకీ క్రిందఁ జెప్పఁబడు లక్షణము లుండవలెను నిర్ణీతమగు కాలములో విద్యార్థి చేయఁదగు కృషి యొక్క కార్యములను గలిగియుండునదిగా నుండవలెను. విద్యార్థి నాలోచనకుఁ బురికొలిపి స్వతంత్రముగఁ గృషి చేయుటకుఁ బ్రోత్సహించునదిగా నుండవలెను దానియందుపాధ్యాయుఁ డిచ్చునట్టి సూచనలను గ్రహించి విద్యార్థి సొంతముగఁ గొన్ని విషయముల నర్థము చేసికొనవలసి యుండును మఱికొన్నిటి స్వరూపములను నిర్ణయించుకొనవలసి యుండును కావున విద్యార్థి తనకుఁ దాను పరిశీలించి యాలోచనాశక్తి నుపయోగించి యుత్తరముల దెలిసికొనవలసిన ప్రశ్నలుండుట ముఖ్యము. విద్యార్థి జ్ఞానమును సంపాదించుకొనుటకు మార్గదర్శకముగనుండి యతఁడెట్లు కృషిచేయవలసినదియు సూచించునదిగా నుండవలెను విద్యార్థి కందుబాటులో నున్న గ్రంథాలయమునందలి పుస్తకములలోఁ గాని విద్యార్థి పాఠ్య పుస్తకములలోఁగాని, లేని యంశము లేవైన నియోజనములో నుండవలసినచో నాయంశములను నియోజనమే తెలియఁ జెప్పవలెను ఏ యంశము నే గ్రంథము తెలియఁజేయునో సూచించునదిగా నుండవలెను.

ఇన్ని లక్షణములతోఁ గూడిన నియోజనమును సిద్ధము చేయుట యుపాధ్యాయునకుఁ గొంత శ్రమను గలిగించక పోదు. అతఁడు పాఠ్యగ్రంథమందలి యంశముల నన్నిటిని మిక్కిలి జాగరూకతతోఁ బరిశీలించవలసి యుండును. పాఠ

శాలా గ్రంథాలయమునందును విద్యార్థుల కందుబాటులో నున్న యితర గ్రంథములందును గల విషయములన్నియు నతనికిఁ దెలిసియుండవలెను మొదటమొదట నుపాధ్యాయునకిది శ్రమఁ గల్గించినను ననుభవముమీఁద సులభము కాఁగలదు

ఈపద్ధతివలనఁ గలుగు లాభములేవో తెలిసికొందము తరగతి యందున్న బాలురెవరి శక్తిసామర్థ్యములనుబట్టి వారు పురోగమించుటకు వీలుకలదు మందమతుల కొఱకుఁ గనిపెట్టుకొని యుండక తెలివిగలవారు తమ నియోజనమును బూర్తిచేసికొని మరొక నియోజనము బ్రారంభించవచ్చును ఎవరెప్పుడు నియోజనమును బూర్తిచేసినచో వారు మరొక నియోజనమును దీసికొనవచ్చును. అందుచే తెలివిగలవారు మందమతులకొఱకుఁ గనిపెట్టుకొని యుండవలయుటగాని, మందమతులు తెలివిగలవారితోఁ బాటు పోలేక యవస్థ పడవలయుటగాని సంభవించదు ఆకారణముచేతనే విద్య నభ్యసించుటకై తాను చేయు కృషియందు విద్యార్థి కభిరుచి గలుగును అభిరుచి యేర్పడినఁగాని విద్య యలవడదు గదా సమష్టిగాఁ బాఠమును బోధించునపుడు విద్యార్థులలో కొందరన్యమనస్కులై యుండుట తటస్థించును వారిని గన్గొనుట యుపాధ్యాయున కలవిగానిపని ఈపద్ధతియందు విద్యార్థులెవరికివారు వ్యష్టిగాఁ బనిచేయుదురుగాన వారు తమతమ పనులయందే నిమగ్నులై యుందురు. ఉపాధ్యాయుఁడు విద్యార్థుల తెలివితేటల నభిరుచులను వ్యక్తిగతముగాఁ దెలిసికొనుటకుఁ జక్కని యవకాశమీ పద్ధతియందుఁ గలదు. సమష్టి బోధన

లో నిట్టి యవకాశము లేదు తన శక్తి కొలఁది విద్యార్థులకు సహాయముచేయుటకీ పద్ధతియందు మిక్కిలి, వీలుకలదు నియోజనములను దిద్దునపుడేమి బాలుర నెదుట నుంచుకొని ప్రశ్నించునపుడేమి బాలురయందలి లోపములను దెలిసికొని సవరించుటకు మఱియేయితర పద్ధతియందు నిట్టి వీలు లేదు సామాన్యముగాఁ బై తరగతులయందుపాధ్యాయుఁడు చెప్పు నంశములను వ్రాసికొనుటయందే చాలకాలము వ్యర్థమగుచున్నది బాలురు విషయమును బోధపఱుచుకొనుట యింటియొద్దఁగాని, పరీక్షలకుఁ బూర్వముగాని జరుగుచున్నది. ఈపద్ధతి నవలంబించినచో బడియందిట్టి కాలహరణము జరుగుట యేర్పడదు. స్వయముగా నియోజనములఁ బూర్తిచేయుట కావునఁ బూర్తిచేయునప్పుడే విద్యార్థికి చక్కగా విషయము బోధపడును ఒకేపాఠ్యగ్రంథమున నిర్ణయించుటలో బాలురు నేర్చుకొనవలసిన యంశములు నిబంధించఁ బడుచున్నవి ఒకచోట బాలురు నేర్చుకొనవలసిన యంశములకును మఱొకచోట బాలురు నేర్చుకొనవలసిన యంశములకును భేదముండవచ్చును. ఒకేపాఠ్యపుస్తకము ననుసరించుటలో నాభేదములను గమనించుటకు వీలుండదు ఈ పద్ధతియందట్లు కాక బాలురు తెలిసికొనవలసిన విషయములు నియోజనముల మూలమున నెప్పటికప్పుడు నిర్ణయించఁబడును ఇతరులపై నాధారపడుట యనెడి దుర్గుణము విద్యార్థికలవడక స్వయంకృషిపైనను స్వతంత్రాలోచనపైన నాధారపడుట యేర్పడుచున్నది అతఁడుపాధ్యాయునిపైఁ గూడ నెలపుడు నాధారపడుటకు వీలుండదు.

ఈ పద్ధతి నవలంబించుటలోఁ గొన్ని బాధకములు గూడఁ గలవని కొందఱందురు కాని యందు జాలవఱకుఁ దొలఁగించుటకు వీలగును ఉపాధ్యాయునకు శ్రమ యధిక మగునని యొక యాక్షేపణ తనవిధిని నెఱవేర్పఁదలఁచుకొన్న యుపాధ్యాయునకే పద్ధతి యైనను శ్రమనిచ్చును తరగతి పద్ధతియందుఁగూడ బడిలో నిర్ణీత కాలమునందుఁ బనిచేయు టయేగాక బాలురచే బడివేళలో వ్రాయించిన వ్యాసములు మొదలగు లిఖితరచనలను బడిగంట నతిక్రమించియే యుపాధ్యాయుఁడు దిద్దవలెను. అప్పటప్పటికిని బెట్టు పరీక్షలవలన సమాధానపత్రములు నట్లే దిద్దవలసియుండును. వ్యక్తిపద్ధతి ననుసరించుటవలన నీశ్రమ యుండదు విద్యార్థులు నియోజనములను శ్రద్ధతోఁ బూర్తిచేయకున్నఁ దమ యభివృద్ధికే భంగము గలుగును ఉపాధ్యాయుఁడు కొన్నివిషయములలో మాత్రము తరగతిపద్ధతి నవలంబించునప్పటికన్న నెక్కువశ్రమ పడవలసి వచ్చును. ఐనను వాని శ్రమకుఁ బూర్తిఫలితము కలుగును. ఇప్పుడున్నట్లు నలుబదిమంది విద్యార్థులుగల తరగతులలో నీపద్ధతి నవలంబించుటకు వీలుండదని మఱొక యాక్షేపణ. అది నిజమేకాని యొక్కొక్క తరగతియందు నిరువది మంది బాలురు మాత్రమే యుండునట్లు చూచుకొనినచో నీబాధకము తొలఁగును. బాలురు నియోజనములకు సమాధానముల వ్రాయునపు డొకరి నొకరు చూచి వ్రాయుదురని మఱొక యాక్షేపణ. ఉపాధ్యాయుఁడు కొంచెము జాగ్రత్తగా వ్యవహరించినచో బాలురట్లు చేయరు. నియోజనమును బా

లుఁడు పూర్తి చేసిన తర్వాత వానిని ప్రశ్నించి పరీక్షించినచో వాని ప్రగతి బయటఁ బడును. తగిన వయస్సు వచ్చినవారైనచో నట్లు చేయుటవలనఁ దనకుఁ గలుగు నష్టమును బాలురే తెలిసికొందురు బాలురెవరికి వారు వ్యష్టిగాఁ గృషి చేయుటయే నిరంతరము జరుగుచుండుటచే వారియందు సాంఘిక భావము పెంపొందదనున దింకొక యాక్షేపణ. దీనిని దొలఁగించుటకు వారమునకుఁగల నాలుగైదు గంటలలో నొకగంట సమష్టి సమావేశము జరుపవలసి యున్నది ఒకే శ్రేణికిఁ జెందిన యిద్దరు ముగ్గురు విద్యార్థులొకరితో నొకరు సహాకారముఁ జేసికొనుచుఁ గృషి చేయు నట్లేర్పాటు చేయవచ్చును ఈ పద్ధతి మిక్కిలి ధనవ్యయముతోఁ గూడిన దనుటయు నొక యాక్షేపణయే పాఠశాలయందు ముఖ్యముగా నవసరమైన గ్రంథాలయమునకేమి, నియోజనములను ముద్రించుటకేమి డబ్బు కావలసినమాట నిజమే బాలుర విద్యకొఱకు ధనమును వెచ్చించుటకు ప్రభుత్వము వెనుదీయరాదు గ్రంథాలయమునందలి పుస్తకములు దొంగిలించఁబడకుండ, పుస్తకములు త్వరగా జీర్ణముగాకుండ నుపాధ్యాయుఁడు తగిన శ్రద్ధ తీసికొనవలెను. అందుకై యుపాధ్యాయుఁడు తరగతియందలి విద్యార్థులలోఁ గొందఱి సహాకారముఁ గోరఁదగును.

ఈపద్ధతిని మధ్యమదశనుండి మాతృభాషను బోధించునపు డుపయోగింప నగును. వ్యాకరణమును లిఖితరచననుగూడ బోధించుటకు వీలుగా నియోజనములను సిద్ధము చేయవచ్చును. సమష్టిబోధనకు వినియోగించు కాలమునందు

వాచిక చర్యకుఁ దగిన యవకాశము గలదు ఈమధ్యమ దశ యందుఁ బాఠబోధనకుఁ బూర్వప్రయత్నముగ నీ నియోజనముల నీయఁదగును బోధింపఁబడు పాఠమునందు బాలురు స్వాంతముగఁ దెలిసికొనుటకు వీలయిన యంశముల నన్నిటిని ముందే తెలిసికొని యుండినచోఁ దరగతియం దుపాధ్యాయునకును విద్యార్థులకును సులువుగా నుండును

ఇట్టి నియోజనములయందీ క్రింది విషయము లుండఁదగును పాఠమునందలి ముఖ్యాంశము లర్థమగు నంతవఱకు బాలురను బాఠము జదువవలసినట్లు కోరవచ్చును వచనమైన పానపరనము పద్యములైనఁ బ్రకాశపరనము వారికర్థముకాని పదములను వ్రాసియుంచవలసినదిగాఁ గోరవచ్చును పాఠమునందలి ముఖ్యాంశములను సంగ్రహముగా వ్రాయించవచ్చును ముఖ్యాంశములపైఁ గొన్ని ప్రశ్నలనిచ్చి వానికి సమాధానములను వ్రాయించవచ్చును. ఈ విధమున బాలుర చేతఁ గృషిచేయించిన పిదప నుపాధ్యాయుఁడా పాఠమును సాధారణపద్ధతి ననుసరించి బోధించవచ్చును.

## వాచిక చర్య

ఏ మానవుఁడైనను దన యభిప్రాయముల నితరులకు వెల్లడించుటలో నెక్కువగానాధారపడునది లేఖనముపైఁగాదు—వాక్కుపైననే వ్రాయుటయందును జదువుటయందును విని యోగించుకాలమునకన్న నెన్నియో రెట్లెక్కువ కాలమును మాటాడుటయందే యెల్లరును గడపుట మనకుఁ దెలియును.

కావునఁ బ్రతిమానవుఁడును మంచి వాగ్ధోరణి గలవాఁడుగ నుండవలసినట్లు చూడవలయును అందులకుఁ బునాదిగాఁ బాఠశాలయందు విద్యార్థులకిచ్చు నభ్యాసమునకే వాచికచర్చ యని పేరు

బాలుఁడు పఠనలేఖనములను బడికి వచ్చిన తర్వాత నభ్యసించుచున్నాఁడు గాని బడికి రాకమునుపే వానికి మాటాడుట తెలియును లేఖనముకన్నఁ బఠనమును బఠనముకన్న మాటాడుటయును సులభతరములు చక్కఁగాఁ మాటాడఁగల వాఁడింపుగాఁ జదువఁగలుగును. ఇంపుగాఁ జదువువాఁడు బాగుగా వ్రాయును అందుచే వాచికచర్యయందు బాలురకిచ్చు నభ్యాసము వారికి మిక్కిలి ప్రయోజనకారిగానుండును. చక్కఁగా మాటలాడువాఁడు జీవితమున మిక్కిలి రాణించును. అందుచేత నీశక్తిని బాల్యమునుండియే బాలురయందు మిక్కిలి వృద్ధిఁ బొందించవలెను ఏవిషయమును నేర్చుకొనుటకైనను బాల్యమే తగినకాలముగదా వాచికచర్యాసమయములందు మాటాడు విషయములను సరిగా నమర్చుకొనుట నేర్చుకొనినచో లేఖనాదులయందా యభ్యాసము మిక్కిలి యుపయోగపడును ఇందుమూలమున సభాకంపము పోవుటయేగాక యాత్మవిశ్వాసము కల్గుటయుఁ బగజాల నభివృద్ధి జెందుటయుఁ గల్గును బాలుర భాషాదోషముల నీసమయమందే సరిదిద్దినచో నది వారికిని, ఉపాధ్యాయునకును బై తరగతులయందుఁ జాల శ్రమను దగ్గించును

బాలురకు నుపాధ్యాయులకును జరుగు సంభాషణల

రూపమున నిది మొదట నారంభమై గేయములు, పాటలు, పద్యములు వల్లించుటగా మారి, కథాకథన రూపమున వృద్ధి జెంది, మధ్యమదశయం దుత్తరచనా రూపమును గైకొని, యున్నతదశయందు వక్తృత్వ శిక్షణముగాఁ బరిణమించు చున్నది.

ప్రాథమిక దశయందు వాచికచర్య యెట్లు జరుగవలెనో మొదటఁ బరిశీలింతము బాలుఁడు పాఠశాలయందుఁ బ్రవేశించినతోడనే విద్యాబోధన వాచికచర్యా రూపమున నారంభమై కొన్ని నెలలవఱకు నేకైకవిద్యాబోధనా స్వరూపముగనుండును ఇల్లు, కుటుంబము, ఇంటియందు చేయుపనులు, తోట, ఆటలు, బడి, సంత, తరగతియందలి బొమ్మలు, పరిసరములలోఁగను పట్టు జంతువులు, పక్షులు, చెట్లు, పండుగులు, ఉత్సవములు, మంచి యభ్యాసములు, బాలురు చూచిన ప్రదర్శనములు మొదలగు విషయములను గుఱించి యుపాధ్యాయుఁడు బాలురను బ్రశ్నించి వారిచేత సమాధానములఁ జెప్పించుచుండవలెను ఇట్టి సంభాషణములమీఁద బాలురకు సహజముగా ననురక్తి యెక్కువగాన వారు సంతోషముగా సంభాషింతురు బాలురకు స్వీయాభిమాన మెక్కువగా నుండును. కనుక తమ్ము గుఱించియు, తమ యిండ్లు, బంధువులు, స్నేహితులు మొదలగువిషయములఁగుఱించియుఁ బ్రసంగించుటవారికిసంతోషము నిచ్చును అందుచేత మొదటిరెండు తరగతుల బాలురవిషయమున వారికి బాగుగాఁ దెలిసిన యంశముల మీఁదనే సంభాషణము చేయవలెను ఇందుకై కాలనిర్ణయ పట్టిక యదుం

వారమునకొక రెండుగంటల కాలమును వినియోగించఁదగును. బాలురు చిన్న వాక్యములలో సమాధానములను జెప్పునట్లు చూడవలెను ఆచిన్నవయస్సుగాని బాలురకు లజ్జయు భయము నుండవచ్చును వానిని క్రమముగాఁ బోఁగొట్టుట కుపాధ్యాయుఁడు ప్రయత్నించవలెను బాలుఁడు చేయునట్టి యుచ్చారణా దోషములకుఁగాని, భాషా దోషములకుఁగాని ప్రాముఖ్యము నీయరాదు ప్రాముఖ్యమునిచ్చి వానిని బహిరంగము చేసినచో బాలుని భయమధికమగును అందుచేత నప్పుడప్పుడు నొక దోషము నుపాధ్యాయుఁడు సవరించుచుండవచ్చును ఈసందర్భమున నుపాధ్యాయుఁ డొకవిషయమును జ్ఞప్తియందుంచుకొన వలెను. బాలుని సహజ ప్రవృత్తులలో ననుకరణ మొకటి అతఁడు మొదట మాటలాడుటనుగూడ ననుకరణముమూలము ననే నేర్చుకొనెను ఈదశయందు గూడ ననుకరణముచేత నిర్దుష్టముగను, స్పష్టముగను, ధారాళముగను మాటలాడుట కతఁడు నేర్చుకొనఁగలడు కావుననుపాధ్యాయుఁడు వేగముగఁ గాని, యస్పష్టముగఁగాని, దుష్టముగఁగాని, యజాగ్రత్తగాఁ గాని మాటాడకుండఁ దగిన జాగ్రత్త వహించవలెను బాలురు తమలోఁ దాము సంభాషించుకొనునట్లుఁ గూడ నేర్పాటు చేయవచ్చును. కొన్ని చిన్న పాటలను బద్యముల నభినయ గీతములను గూడ నేర్పవలెను. బాలబాలికలాటల సమయము నఁ బాడుకొను పాటలును జిన్నచిన్న ప్రార్థన పద్యములు నిందులకుఁ బనికివచ్చును బాలగేయములకు నభినయ గీత ములకును బరస్పర సంక్రమణము గలదు కథలను జెప్పి

బాలురచేత మరలఁ జెప్పించుట కూడ వాచిక చర్యయందొక భాగమే

మధ్యమదశయందుఁగూడ వాచికచర్య కిట్టే యవకాశము గలదు. ఇచ్చటఁగూడ బాలురకుఁ దెలిసిన విషయములనుగూర్చి వారిచేత నప్పటి కప్పటికిని మాటలాడించవచ్చును. కథాకథనమున కియ్యెడఁ గూడ మంచి యవకాశమేకలదు. వాద ప్రతివాదములకుఁ దావుండునట్టి యంశములను గూర్చకూడ బాలురచేత మాటలాడించవచ్చును. వారు మాటలాడునట్టి యంశములు వారికుత్సాహము కలవియేకాక వాడుకలో నుండునట్టివిగాఁ గూడ నగునట్లుగా నుపాధ్యాయుఁడు తగిన శ్రద్ధ వహించవలెను. కొంచెము కఠినములగు పద్యముల నీదశయం దుపయోగింపవచ్చును అభినయ గీతముల స్థానమును నాటకీకరణ మాక్రమించును. ప్రాథమిక దశయందువలెఁ గాక యీదశయందు బాలుర చేయునట్టి యుచ్చారణా దోషములను భాషాదోషముల నుపాధ్యాయుఁ డెప్పటి కప్పుడే సవరణ చేయవలెను. సాధ్యమైనంతవఱకు బాలురే యొకరిదోషముల నొకరు సవరించునట్లు చేయుచు నట్లు వీలుకానపుడు మాత్రమే యుపాధ్యాయుఁడు తాను సవరించుటకుఁ బూనుకొనవలెను. ఉపాధ్యాయుఁడే బాలురతోఁ గొన్ని యంశములఁగూర్చి ముచ్చటించుటయుఁ జేయవచ్చును. బాలుఁ డేదైనను దోషముఁ జేసినపుడు సవరించుటకుఁ బ్రయత్నము చేయక మిగిలిన బాలురు పరిహసించుటకుఁ బూనుకొనకుండఁ జూడవలెను.

# ఉక్త రచన

మానవుని నిత్యజీవితమం దుక్త రచనకున్న ప్రాధాన్యము లిఖిత రచనకు లేకపోవుటచేత మధ్యమదశయం దింకను దానినిఁ గొనసాగించవలెను. స్నేహితులతో మాటలాడవలెనన్నను, పెద్దల కేదేని విన్నవించ

వలెనన్నను వారి హృదయము నాకర్షించునట్లు మాటలాడఁగలశక్తిఁ గల వఱచుకొనుట మిక్కిలి యుపయోగకారిగా నుండును.

ఉక్తరచన లిఖితరచనకన్నను సులభమని తలఁచుట పొరపాటు. లిఖితరచనఁ జేయవలయు నన్నపు డెట్లు దానికిఁ గావలసిన విషయమును సమకూర్చుకొనవలెనో యట్లే దీనికిఁ గూడఁ బూర్వప్రయత్న మవసరము. (పూర్వప్రయత్నమును గూర్చి లిఖితరచనావసరమున వివరింతుము.) విషయమున రెండును సమానముగఁ గష్టములే యయ్యు నుక్తరచనాభ్యాసమున బాలుఁడు సభయెదుట నిలువఁబడి మాటాడవలసి వచ్చుట యనునది యధికమైన కష్టమగును. పూర్వప్రయత్నము లేక యప్పటి కప్పుడు సభయెదుట నిలువఁబడి మాటలాడుట మిక్కిలి యసాధ్యమగును గదా. ఇది లిఖితరచనకుఁ బూర్వప్రయత్నమును సహాయకారియు మాత్రమే యని తలఁచుట భ్రమయే యగును.

ఉపాధ్యాయుఁడు పాఠబోధనావసరమున వేయు ప్రశ్నలకు బాలురు చెప్పు సమాధానములుగాని యుపాధ్యాయుని సహాయముతో నేదేని విషయముపై నొకటి రెండు వాక్యములు వారు చెప్పుటగాని యుక్తరచన గాదు. తరగతియెదుట నిలుచుండి యొకటి రెండు నిమిషములైనను స్వతంత్రముగ నవిచ్ఛిన్నముగ బాలుఁడు మాటాడఁగలుగుటయే యుక్తరచన యనిపించుకొనును. విషయము బాలుని యెన్నికయే కావచ్చును ఇట్టి యుపన్యాసములనే బాలోపన్యాసము లందురు. క్రొత్తలో సభయెదుట నిలువఁబడి మాటాడుట విద్యార్థులకుఁ గష్టముగ నున్నను నభ్యాసవశమున వారికి ధైర్యము గలుగును. మాటాడునపుడు వక్త త్వరపడుటగాని యావేశపూరితుఁ డగుటగాని కూడదు.

ఉక్తరచనను బ్రోత్సహించి లిఖితరచనను గొంత తగ్గించినయెడల వ్యాసరచనాభ్యాసముల ననేకము దిద్దవలసిన శ్రమ యుపాధ్యాయున కుండదు

# కథలు

తగిన కథలను దగిన రీతిని బాలురకు బోధించవలసిన యవసరము గలదని యిదివఱకే తెలిసికొంటిమి. ఇందువలనఁ బ్రయోజనమేమో మొదటఁ జూతము. కథలను జెప్పి మఱలఁ జెప్పించుటవలన బాలురకు వాచికచర్యయందు మంచి యభ్యాసము కలుగును. వారు ధారాళముగ మాటాడుటకవకాశ మేర్పడి వారి వాగ్ధోరణి పెంపొందును. కథలన్న బాలురకు సహజముగా ననురక్తి యుండును కనుక బాలురకు బడి యన్నను, ఉపాధ్యాయుడన్నను ప్రేమాభిమానము లేర్పడును. కథల యందలి సన్నివేశములను గ్రహించి మఱల జెప్పుటలో బాలుర భావనాశక్తి పనిచేయవలసి యున్నది. అందుచే నది వృద్ధియగును. ఉత్తమములగు నాశయములఁ గాని నీతిని గాని వ్యంగ్యముగ బోధించి బాలుగు సత్ప్రవర్తన నలవఱుచుకొను నట్లు చేయుటలో దీనివంటి సాధన మింకొకటి లేదు. దీని మూలమున బాలుర పదజాల మభివృద్ధి జెందుటయే గాక రచనయందును వాఙ్మయమునందును వారి కభిరుచిగలుగును. ఇతరములగు కఠిన పాఠములఁ జదువుకొనుట వలనఁ గలిగిన శ్రాంతిని బోగొట్టుటకుఁ గథలు మిక్కిలి సహాయముగా నుండును.

బాలురకుఁ జెప్పుకథ లెట్టి లక్షణములు గలవిగా నుండవలె ననెడి యంశమిపుడు విచారించవలెను. కథావస్తువు బాలుర పరిసరములకు ననుభవములకును సంబంధించినదిగా

నుండవలెను సరళమైనట్టియు సూటియైనట్టియుఁ గఠినము గలది గానుండవలెను కథయందుఁ జర్యాంశమధికముగా నుండవలెను కథయందలి సంభాషణలు ప్రత్యక్షములుగా నుండవలెను కొన్ని పదములుగాని వాక్యములుగాని, కథయందచ్చటచ్చటను మఱలమఱల వచ్చుచుండవలెను శోకమునుగాని భయమును గాని కలిగించునవిగా నుండక అద్భుత రసముగల కథలుగా నుండవలెను ఇపుడు చెప్పఁబడినవి స్థూలముగాఁ గథల కుండ వలసిన లక్షణములు ఏతరగతి కేకథ చెప్పఁదగునో వివేకము తో వేఱుపఱచి చెప్పుటయం దుపాధ్యాయుఁడు శ్రద్ధ వహిం చవలెను బాలురకుఁ గేవలము పరిచితములైన జంతువులకుఁ గాని, వస్తువులకు గాని సంబంధించిన కథలనే మొదటి తరగతి వారికిఁ జెప్పఁదగి యుండును అద్భుత రసముగల కథలను రెండవతరగతియందుఁ జెప్పఁదగును మూఁడు, నాలుగు, ఐదు తరగతులలోఁ బౌరాణికములును, జరిత్రలోనివియు నగుకథ లను జెప్పవచ్చును కల్పనా కథలుగూడ వీరికానందమునే కల్గించును

ఇంతవఱకుఁ బ్రాథమిక దశయందలి కథల లక్షణములను దెలిసి కొంటిమి మాధ్యమదశకు వచ్చునప్పటికి బాలుర మనస్సులు కొంతవఱకు వికాసముఁ జెందియుండును. అందుచే వారికేదిసత్యమో, యేదియసత్యమో తెలియును. ఈదశయందలి బాలురకుఁ గల్పనా కథలయెడ వైముఖ్య మేర్పడుటకుఁ బ్రారంభమగును. వీరినాకర్షించునవి పౌరాణికములును జరిత్ర సంబంధములు నగు వీరగాథలు. ప్రాథమిక దశయందుఁ జెప్పినట్లు క్లుప్తముగఁ జెప్పక వీరికిఁ బౌరాణికములును జరిత్రలోనివియు నగు కథలను విపులముగాఁ జెప్పవచ్చును. ఈదశ ముగియునప్పటికి బాలురకు భారత

రామాయణ భాగవతములయందలి ముఖ్యములైన యుపాఖ్యానములన్నియుఁ దెలియునట్లు చూడవలెను. ఆంధ్రదేశమునందును భారతదేశమునందును ప్రఖ్యాతిఁగన్న వీరులయొక్కయు, భక్తులయొక్కయు, త్యాగులయొక్కయు, ధర్మాత్ములయొక్కయుఁ గథలు బాలుర మనస్సుల నాకర్షించి వారి మనస్సులయందుఁ జక్కగా నాటుకొనును. తత్ఫలితముగా విద్యార్థులు తమ ప్రయత్నములేకయే యితరుల నిర్బంధములేకయే మంచిప్రవర్తన నలవాటు చేసికొనుట కవకాశ మేర్పడుచున్నది. ఎంతయో శ్రమపడి మహాపురుషులు కొందఱు క్రొత్త క్రొత్త శక్తులనేకము కనిపెట్టిరి. కొందరు యంత్రసాధనములఁ గనిపెట్టిరి. కొందఱువినోదసాధనములఁ (రేడియో మొదలగునవి) గనిపెట్టిరి. ఇట్లుఁ గొందఱు సముద్రముమీఁదను గొందఱు దుర్గమములగు నరణ్యములమధ్యను గొందఱు హిమమండలములగు పర్వతాగ్రములయందును సంచరించి క్రొత్తక్రొత్త ప్రదేశములను విషయములను గన్గొనిరి. వారి ప్రయత్నములను దెలియఁజేయు కథలును నీదశయందు బోధింపఁదగినవే. దీనివలన బాలురలోఁ బట్టుదల యేర్పడు నవకాశము గలదు. మత ప్రవక్తలు, దేశభక్తులు మొదలగు మహాపురుషుల జీవితములయందలి ప్రధాన ఘట్టములకుఁ జెందిన కథలను గూడ బోధింపవచ్చును.

ఏకథలను బోధించవలెనో తెలిసికొనినతర్వాత నెట్లు బోధించవలెనో తెలిసికొనుట యవసరము. పుస్తకమును జూచుచుఁ జెప్పుకథ బాలురనాకర్షించఁ జాలదు. కావుననుపాధ్యాయుఁడు బాగుగా సిద్ధపడివచ్చి స్వతంత్రముగ నాశువుగఁ జెప్పవలెను. అప్పుడే కథకును, కథకునకును శ్రోతలకును గాఢమగుసంబంధమేర్పడును. బాలురును సావధానులుగ నుందురు. ఉపాధ్యాయుఁడు తన దృష్టిని శ్రోతలపై నుంచుట మూలమునఁ గథనము సహజమై సజీవమై రసవంతమై యుండును. అట్లని

యుపాధ్యాయుడు కథను కంఠస్థము చేయరాదు కథాంశము పూర్తిగా వారికిఁ దెలిపియుండిన జాలును మధ్యమధ్యఁ బుస్తకమును జూచుటవలనఁ గథ రక్తిగట్టదు ఆశువుగాఁ జెప్పఁగల స్థైర్యముపాధ్యాయునకు లేనిచోఁ బ్రారంభమునఁ గంఠస్థముఁజేసి చెప్పునం క్రమముగా స్వతంత్రముగఁ జెప్పఁగల స్థితికి రావలెను చిన్నపిల్లలకుఁ జెప్పు కథలలోఁ గొన్ని పదములు గాని వాక్యములుగాని పునరావృత్తిగ వచ్చుచుండవలెను సంప్రదాయ సిద్ధముగా వచ్చువిధమునఁగాని సుతిచేసి తగినవిధమునఁగాని కథను బ్రారంభించుటయు ముగించుటయుఁ జేయవచ్చును. మొదట నొకటిరెండు వాక్యములను జివర నొకటిరెండు వాక్యముల నుపాధ్యాయుఁడు కంఠస్థముఁజేయుటయు వాంఛనీయమే కథయందలి భాష చాల సరళముగా నుండవలెను. నిర్దుష్టమైన వ్యవహారభాష నుపయోగించవలెను. కథయందేది ముందు జెప్పవలెనో యేది వెనుకఁ జెప్పవలెనో గమనించి కథ యతుకుబోకుండఁ జెప్పవలెను. కథ మిక్కిలి చిన్నదిగాఁగాని, మిక్కిలి దీర్ఘముగాఁగాని యుండక తరగతికిఁ దగినంతదిగా నుండవలెను. హాస్యరసమునకుఁ బ్రాధాన్యము నిచ్చుట గూడ మంచిదే కాని యది యుత్తమ హాస్యముగా నుండవలెను. కథకు సంబంధించిన చిత్రపటములను సేకరించుట మంచిదే కాని వానిని గథను జెప్పునపుడు చూపక కథాంతమునఁ జూపుట మేలు. లేనిచోఁ గథపై బాలురకుఁ గల యేకాగ్రతకు భంగముకలుగును కథఁజెప్పునపుడు మధ్యలోఁ బాలురను గథాంశముపై బ్రశ్నించుట తగదుగాని వారి

కర్థమగుచున్నదియు లేనిదియుఁ దెలిసికొనుటకై యొకటిరెండు చిన్న ప్రశ్నలను వేయుట దోషముగాదు. ఇఁక నభినయము విషయమునఁ గూడ నుపాధ్యాయుఁడు జాగ్రత్త వహించవలెను. ఉపాధ్యాయుఁ డభినేత గాదు కావున నతఁడాంగికాభినయమును జేయుటకుఁ బ్రయత్నించవలసిన యవసరము లేదు. సందర్భమునుబట్టి సహజముగా నతఁడు చేయునట్టి యాంగికాభినయము చాలును. వాచికాభినయము మాత్రము చాల ముఖ్యము. కథనమున దీనికి మిక్కిలి ప్రాముఖ్యము. తగిన విరామములతో సమయమునుబట్టి మార్చునట్టి స్వరభేదములతోఁ గథను జెప్పుటయే వాచికాభినయముఁ జూపుటయగును. కథయంతయుఁ జెప్పినపిదప నీతినుపాధ్యాయుఁడు వాచ్యముగఁ జెప్పరాదు. సరిగా గ్రహించినచో బాలురే నీతిని గ్రహించఁ గల్గుదురు. అప్పుడుమాత్రమే యానీతికి వారిప్రవర్తనపైఁ బ్రభావముండును. మధ్యమదశయందుఁ గూడ నీపద్ధతియే యనుసరణీయము.

ఉపాధ్యాయుఁడు కథను జెప్పిన యనంతరము బాలుర చేత దానిని జెప్పించవలెను. మొదట చిన్నచిన్న ప్రశ్నల మూలమునఁ గథనంతయుఁ గ్రమముగా రాఁబట్టవలెను. ఈ విధముగాఁ జెప్పించినతర్వాత బాలురచేతఁ బ్రత్యేక ప్రత్యేకముగాఁ గథను జెప్పించవలెను. కథాచిత్రములను వారికి సహాయముగా నుంచవచ్చును. కథాంశములకు సంబంధించిన దోషములను మాత్ర ముపాధ్యాయుఁడు సవరించక బాలుర చేతనే సవరింపఁజేయవచ్చును. భాషాదోషముల నుచ్చారణా

దోషముల నుపాధ్యాయుఁడు సవరించవచ్చును బాలురు సొంతముగాఁ గథను జెప్పఁగల్గిన తర్వాత వారిచేత నాకథను నాటకముగా వేయించవచ్చును. అపుడు బాలురే వారి సంభాషణములను వారేసిద్ధము చేసికొనఁగల్గుదురు కథకు సంబంధించిన చిత్రములను గొన్నిటిని బాలురచేత లిఖింపఁజేయ వచ్చును వానియాకారములను మట్టితో నిర్మింపఁజేయవచ్చును.

మధ్యమ దశయందైనచో పైఁ జెప్పినదానిఁ దోడఁగ నాకథయే పుస్తకమునందు బాలురకుఁ దగిన శైలిలో, వ్రాయఁబడి యున్నదో యా పుస్తకమును జదువవలసినదిగా బాలురను బ్రోత్సహింపఁదగును. వారనట్లు పురికొల్పుటకుఁ దగినట్లు కొన్ని ప్రశ్నల నుపోద్ఘాతముగా నీయఁదగును. ఈవిధముగా వారిని జదివించిన తర్వాత వారిని బరీక్షించునట్టివి కొన్ని ప్రశ్నలనిచ్చి సమాధానముల వ్రాయించుటయుఁ గథయందలి సారాంశమును వ్యాసరూపమున వ్రాయించుటయుఁ జేయవచ్చును.

పైనఁ జెప్పఁబడినవే కాక బాలురను ముమ్ముందు మంచివక్తలనుగాఁ జేయుట కుపాధ్యాయుఁ డితర విధములఁ గూడఁ బ్రయత్నింపవలెను. ఆకథాంశమునకు సంబంధించిన సంభాషణములను విద్యార్థులచేతఁ జేయించుటయు నాటకము నాడించుటయు నీసందర్భమున గమనింపఁదగును.

కథాచిత్రములు గల పటముల నభినయ గీతముల నుపాధ్యాయుఁడుపయోగించనగును పటములనుజూచి బాలురూహించి కథను మిగిలిన తరగతికి బోధించునట్లు చేయుట మూలమున బాలుని యూహాశక్తికిని గథనశక్తికిని బరిశ్రమ కలుగుచున్నది కథారూపముననున్న పద్యములను బాటలను బాలురకు నేర్పవలెను ఇందు మొదటివి మధ్యమదశలోఁ

ప్రవేశపెట్టఁదగును రెండవరకమునకుఁ జెందినవానికే ప్రాథమిక పాఠశాలలయందు స్థానము వీనినే యభినయ గీతములనియు నందురు ఈగీతములను బాడునపుడు వాచికాభినయమునకుఁదోడాంగికాభినయమును గూడఁ గొలఁదిగాఁ బ్రదర్శించవలసి యుండుటచేత వీనికీపేరు తగియున్నది. ఆవిధముగాఁ బాడిననే యవి పాడునట్టివాని కర్థమైనట్లు తెలియుట గాని వినువారికి సులభతరముగా నర్థమగుటగాని జరుగును. అభినయమును జేయవలెననెడి యుత్సాహము బాలురలో సహజముగా నుండును ఒక్కొక్కరే పాడుటకు బాలురు మొదట జంకుదురు గావున నుపాధ్యాయుఁడు మొదటఁ దాను మాత్రము పాడి పిదప తనతోఁ గలిసి బాలురు పాడునట్లుచేసి తర్వాత బాలురను మాత్రము మొత్తముగాఁ బాడించి చివరనే వ్యష్టిగా బాలురచేతఁ బాడించఁదగును ఇవి యొకలయతోఁ గూడుకొనియుండును. కావున బాలురకు సులభముగా జ్ఞాపకముండును నాటకీకరణము నందువలె బాలురకు సంగీతమునందును నటనయందు నభిరుచి యేర్పడుటయు నుచ్చారణ బాగుపడుటయు జరుగును కొన్ని క్రొత్తమాటలు నేర్చుకొనుటచేఁ బదజాల మభివృద్ధి జెందును.

మధ్యమదశయందు (బాలునిచే) నిర్ణీత విషయముపైఁ గొంత సేపు మాటాడఁగలట్లు శిక్షణ నిచ్చుటఁగూడఁ జేయఁదగును. ప్రాథమికదశయందలి బాలురు మిక్కిలి చిన్నవారుగా నుందురు వారిలో నాలుగైదు తరగతులవారి నిందులకుఁ బ్రాతిపదికగా బడిలోఁ జెప్పఁబడినవికాక వారితరవిధములుగా

నేర్చుకొనిన కథలను తరగతిలోని మిగిలిన బాలురకుఁ జెప్ప వలసినదిగాఁ గోరవచ్చును.

మధ్యమదశయందు బాలురనే, యేదో యొక విషయము నేరుకొను నట్లు చేసి యతఁడు బాగుగా సిద్ధపడి వచ్చిన వెనుక వానిచేత మాటాడించ వలెను. అతఁడు తరగతియెదుట నిలువఁబడి మాటాడవలెను. భావముసకే గాని, భాషకుఁ బ్రాధాన్య మీయరాదు. విద్యార్థిని నిరుత్సాహపఱచుట తగదు. చెప్పఁదలఁచుకొనినవిషయము నెదుటివారికి స్పష్టమగునట్లు తాఁను చెప్పఁ గలుగుటయే ముఖ్యము. విషయమును బాలుఁడింటియొద్ద వ్రాసికొనఁగలసి నట్లు కోరవచ్చును. ధైర్యముగాఁ బ్రారంభించుటకై మొదటి వాక్యమును బాగుగాఁ ముగించుటకుఁ జివరివాక్యమును కంఠస్థముఁజేసినఁ జేయవచ్చును. మిగిలినభాగమును జక్కఁగా మననము చేసికొని యుండవలెను. చూచి చదువుపద్ధతిని బ్రోత్సహింపరాదు. ఈ శిక్షణకై వాగమునకొక గంటను వినియోగింపవచ్చును. భావములు కుంటుపడక పోయినచోఁ బదములు కొంత కుంటుపడినను వచ్చిన నష్టములేదు. అప్పటప్పటికిని వాడన కడ మిచ్చువిషయములనుగూడఁ దీసికొనవచ్చును. విద్యార్థియితరుల యుక్తిప్రాయ ములనుగాని, ఉపాధ్యాయుని యోచనలనుగాని కొన్నిటని దీసికొని తన యుపన్యాసమును సిద్ధము చేసికొనవచ్చును.

## వాచిక చర్యయం దుపాధ్యాయుఁడు సవరించవలసిన దోషములు

విద్యార్థి చెప్పఁ దలఁచుకొనిన భావమును సరిగా నేర్చుకొని చెప్పలేక పోవుట గొప్ప లోపము. ఇందుకు భయము కారణము గావచ్చును అతఁడు పొరపడుచున్నపు డితరులు గేలిసేయకుండునట్లు చూచుచు నతఁడు భాషించు

నలఁచుకొనిన యంశములను వ్రాసికొని చక్కఁగా మననము చేసికొనవలసినదిగా నాదేశించవచ్చును క్రమముగా వానియందు ఆత్మవిశ్వాస మేర్పడును. ఉపాధ్యాయుఁడు బాలురకుఁ గొన్ని సూచనలనిచ్చి ఎట్లెట్లు వ్యాసమును బరిచ్ఛేదములుగా విభజించఁ దగునో ముందుగనే చెప్పవచ్చును

వాని భాషలోఁగూడఁ గొన్ని దోషములుండవచ్చును కర్తకుఁ గ్రియకు సంబంధముండకపోవుట, క్రియాపదములను గాల వచన వాచకములకుఁ దగియుండునట్లుపయోగించుట, సర్వనామములను సరిగా నుపయోగించలేకపోవుట, ఒక పదమునకు కింకొక పదమును బ్రయోగించుట, సందర్భశుద్ధి లేనట్లు పదములనుగాని వాక్యములనుగాని బ్రయోగించుట యనునవి తెలుఁగుకుఁ జెందిన దోషములు బాలురచేత మొదట మొదటఁ జిన్న వాక్యములఁ జెప్పించునపుడును జిన్నచిన్న ప్రశ్నలకు సమాధానములఁ జెప్పించునపుడు నుపాధ్యాయుఁడు సరిగా బాలురు వాక్యనిర్మాణము చేయునట్లభ్యాసము నీయవలెను వ్యాకరణ జ్ఞానమును గలిగించుటవలన నేప్రయోగములు దుష్టములో తెలిసికొందురు గాని సరియైన ప్రయోగములు మాత్ర మభ్యాసముచేతనే సాధ్యమగును అర్థము విషయమున పొరపడినపుడాయా పదముల యర్థమును వారికిస్పష్టము జేయవలెను భాషాదోషములు తటస్థించుటకు వాక్యములు కొండవీటి చేంతాళ్ళగుటయు నొక కారణమే కావున బాలురుపయోగించునవి సామాన్య వాక్యములుగా నుండునట్లు చూడవలెను.

పైఁ జెప్పిన రెండువిధములగు దోషములయందు నుపాధ్యాయుఁడు కొంత నిర్లక్ష్యము చేసినను గాలక్రమమున నవియే చక్కఁబడును కాని యుచ్చారణా దోషములట్లుగాదు. కావున వీనిని సవరించుటలో నుపాధ్యాయున కెక్కుడు బాధ్యతగలదు స్పష్టముగాఁ బలుకలేకపోవుట, పదముల తుదలను వదలుట, వేగముగా మాటలాడుట, దుష్టమగు నుచ్చారణను గలిగి యుండుట యనునవి యుచ్చారణా దోషములు. ఉపాధ్యాయుఁడు సరిగా నుచ్చరించుచుండినచో వాని యాదర్శమున బాలురును సరిగా నుచ్చరించఁ గలిగియుందురు మొదటి మూఁడు విధములైన దోషములకును భయము కారణముగావచ్చును. అందుచేత బాలురకు భయపడు పరిస్థితులు లేకుండునట్లుగాఁ జేయవలెను. వారు నిదానముగ మాటలాడునట్లు చేసినచో నవి తొలఁగును దుష్టమగు నుచ్చారణా విషయమున నుపాధ్యాయుఁడు క్రింది విధమున సవరణఁ జేయవచ్చును ఇందుఁ గొన్ని బాలుర యవయవములకు సంబంధించిన కారణములచే నేర్పడు దోషములుగావచ్చును అట్టివి చాలవరకు బాలురకు వయస్సు హెచ్చుకొలదిని వానియంతనవియే చక్కఁబడును వీనిని గురించి యుపాధ్యాయుఁడెక్కువ శ్రద్ధవహించవలసిన పనిలేదు కొందఱు పిల్లలు 'క' యను నక్షరమును 'త' యను నక్షరముగాఁ బలుకుదురు అట్టి రకపు దోషము స్వరపేటిక యందును, ముక్కు లోపలిభాగమునను గండరములు పెరుగుట మొదలగు కారణములచే నుచ్చారణ దుష్టముగా నుండవచ్చును ఇట్టివానిని సవరించుటకు

ష్టై ద్ధ్యాని సహాయమవసరము కాఁగా బాలుని యశ్రద్ధవలనఁ గొన్ని దోషములు తటస్థించవచ్చును ఇవియుపాధ్యాయునిచేఁ జక్క-చేయఁబడవలెను ప్రతి యక్షరము పలుకఁబడునపుడును నోటియందేవో రెండుభాగములు కలియును ఇందొకభాగము కదలదు రెండవభాగము కదలును మొదటిదానిని స్థానమనియు రెండవదానినిఁ గరణమనియు నందురు ఏయక్షరమునకేది స్థానమో యేది కరణమో యుపాధ్యాయునికిఁ దెలిసి యుండవలెను బాలుఁడు నానిని దాఁకమారు చేసినపుడే యుచ్చారణ స్పష్టమగుచున్నది నానిని బాలురకుఁజెప్పి యాయక్షరములను బలుకునపుడు నాలుకను గాని పెదవులనుగాని యెచ్చోటఁబగులు నట్లు చేయవలెనో బాలురకు బోధించవలెను ఇందుకై యద్దమును జీపురు పుల్లలను గూడఁ గొందఱుపయోగింతురు ఈ విధముగా బాలురకు శిక్షణ నిచ్చినచో వారు సరిగా నుచ్చరించఁ గల్గుదురు కొన్ని సంయుక్తాక్షరములను బలుకునపుడు గూడ బాలురు తప్పులు చేయుదురు అపుడాసంయుక్తాక్షరము నందలి వర్ణములను వేఱుపఱచి మొదటి వర్ణమును ముందటి యక్షరములతోను రెండవ వర్ణమును వెనుకటి యక్షరములతోను గలిపి వేఱుగాఁబలికించి తర్వాతఁ గలిపి పలుకునట్లు చేయవలెను ఏవర్ణముల నుచ్చరించుటలో బాలురుసహజముగాఁ దప్పులు చేయుచుందురో యట్టి వర్ణములు గల పదములను బాలురు తఱచుగా నుచ్చరించునట్లభ్యాసములను బలుమారు నిచ్చుచుండవలెను

---

# చదువు అలవాటును గలిగించుట

మానవుఁడు నేర్చుకొనెడి జ్ఞానములోఁ బ్రత్యక్షానుభవమువలన నేర్చుకొనునదే దృఢముగా వాని మనస్సునందు నాటుకొనునదైనను బ్రత్యక్షానుభవమువలన నేర్చుకొను జ్ఞానము మిక్కిలి స్వల్పముగా నుండును. గ్రంథములయందుఁ జాల జ్ఞానము మానవుఁడు నేర్చుకొనఁదగినది కలదు. దానిని దెలిసికొనవలెనన్న వాంఛను పఠన శక్తిని వృద్ధి జేసికొని నా యలవాటును బెంపొందించుకొనవలసి యుండును.

ఈ సందర్భమునఁ బఠన లేఖనములలో నేది మొదట నేర్చుకొనఁదగియున్నదను విషయమును విమర్శింతము. చాల కాలమునుండియు మనదేశమున లేఖనమే మొదట నేర్పఁబడి తర్వాతఁ బఠనము నేర్పఁబడుట మనకుఁ దెలియును. ఇది శాస్త్రీయ పద్ధతులకు విరుద్ధమని నేఁడంతట సంగీకరింపఁబడుచున్నది. అందుకుఁ గొన్ని కారణములు కలవు. పాఠశాలయందుఁ బ్రవేశించునప్పటికి బాలునికైదారు సంవత్సరము లుండును. ఆ యీడు వారిచేతి కండరములు లేఖనాసాధనము నుపయోగించుటకుఁ జాలినంత బలము గలవిగా నుండవు. చేతికిఁ దగినశక్తి రాకముందే లేఖనమును నేర్పిన బాలురకు శ్రమ కలుగును. సహజముగా బాలురకు లేఖనమునందుకన్నఁ బఠనమునందే యభిరుచి యధికము. విద్య బాలుర యభిరుచికిఁ దగినట్లుగా నుండకపోయిన వారికి మొదటనే చదువుపై వైరస్యమేర్పడును. బడికి వచ్చుటకుఁ బూర్వమే

బాలురకు మాటలాడుశక్తి యేర్పడియుండుటను మాటలాడు
టకుఁ జదువుటకు నున్న సంబంధము వ్రాయుటతో లేదు.
కావున నేభాషను నేర్చుకొనునప్పుడైనను మొదట మాటలాడ
నేర్చుకొని, తరువాతఁ జదువ నేర్చుకొని యాపిమ్మటనే
వ్రాయుటకు నేర్చుకొనవలసి యున్నది.

## పఠన బోధనా పద్ధతులు

చిరకాలము నుండియు మన దేశమునఁ జదువు
నేర్పుట కుపయోగించు పద్ధతి కక్షర పద్ధతి యనిపేరు దీనినే
ప్రాతపద్ధతి యనియు నందురు అక్షరములనునవి మనముచ్చ
రించు ధ్వనులకు సంజ్ఞలు ఏయక్షర మేధ్వనికి జిహ్వామో
బాలురకు మొదట నేర్పినచో నట్టియక్షరముల చేరికయగు
పదముల నట్టి పదసముదాయమగు వాక్యములను బాలురు
సులభముగాఁ జదువఁగల్గుదురనుటయే యీపద్ధతియందలి
మూల సిద్ధాంతము సులభముగాఁ జదువఁగల్గినవారిని సులభ
ముగా వ్రాయఁగల్గుదురని కూడ నీపద్ధతి కావలెననువారు
చెప్పుచున్నారు. ఈవాదన యుక్తియుక్తముగనే యున్నది
వర్ణమాలలోని యక్షరముల నన్నిటినిఁ గ్రమముగా నేర్పి
గుణింతములు సంయుక్తాక్షరములను నేర్పి చిన్నచిన్న మాట
లతోఁ బ్రారంభించి బాలురు చక్కగాఁ జదువునట్లుచేయుటకు
రెండు మూఁడు సంవత్సరములు పట్టవచ్చును.

ఈ పద్ధతియందు గుణములకన్న దోషములే యెక్కువ
అక్షరములను విడివిడిగ నేర్పుటవలన నట్టియక్షరముల నే

నేర్చుకొనవలెనో బాలురకుఁదోచక యది యర్థరహితముగా నుండును బాలురు మొదట మాటలాడుటకు నేర్చుకొనినపుడు గూడఁ బదములనే పలుకనేర్చిరి కాని యక్షరములనుగాదు కావున వారి కర్థరహితముగాఁ దోఁచిన పనియందు వారి కుత్సాహముండదు అట్టిచో నొకటికొకటి సంబంధము లేని యక్షరములను జ్ఞప్తియందుంచుకొనుట మిక్కిలి శ్రమతోఁ గూడినపని సాధారణముగఁ బ్రథమదశలో నుపయోగపడని యక్షరములగు ఋ, ౠ, ఌ, ౡ మొదలగువానిని, అసలే యుప యోగపడని సంయుక్తాక్షరములను నేర్పుట నిరర్థకము, కాల హరణము నగుటయేకాక బాలురకనవసర శ్రమనుగూడఁ గల్గించును పైకారణములచేత బాలురు మొదటి తరగతిలోనే రెండుమూఁడేండ్లుండవలసివచ్చుట జరుగుచున్నది,

ఈపద్ధతియందలి లోపములను జాలవఱకు సవరించుట వలన నవీనాక్షరపద్ధతి యనునదొకటి యేర్పడుచున్నది బాలుర కనవసరమైన యక్షరములను దీసివేసి వర్ణమాలలోని మిగిలిన యక్షరములనే నేర్పుటయు, గుణింతములోఁగూడ నుపయోగ పడునట్టి సంయుక్తాక్షరములనే నేర్పుటయు వర్ణమాలలోని యక్షరములను వాని యాకారములందలి పోలికలనుబట్టి కొన్ని వర్గములుగా విభజించి యొకే యాకారమునకు జెందిన యక్షరములుగల వర్గము నొక్కసారిగా నేర్పుటయు నీపద్ధతి యందుఁ జేయఁబడిన మార్పులు ఒకవర్గమునందలి యక్షర ములు రాఁగానే యాయక్షరములతో నేర్పడు వివిధ పదము లను నేర్పుట జరుగును

ఇది మొదటి యక్షర పద్ధతికన్నను గొంత మెఱుగే యైనను, ఒకొక్క వర్గమందలి యక్షరములనైనను ఒకొక్క దానిని నేర్చుకొనుట బాలుర కర్థరహితముగనే యుండును. అనవసరమైన యక్షరములను, సంయుక్తాక్షరములను నేర్చు కొనుటవలని శ్రమ తొలఁగిపోవునే కాని యొకొక్క వర్గము నందలి యక్షరములతో నేర్పదగు మాటలు కొలఁదిగా నుండు టయు నట్టి పదములలోఁ గొన్ని బాలురకుఁ దెలియనివిగా నుండుటయు సంభవించును మొదటి యక్షరపద్ధతి వలనఁ బట్టు కాలముకన్న దీనివలన బాలురకుఁ జదువుటను బాగుగా నేర్పుటకుఁ బట్టుకాలము తక్కువయే కాని యదికూడ సుదీర్ఘ ముగనే యుండును మొదటిపద్ధతి యందున్న లాభములన్నియు దీనియందును గలవు

పై రెండు పద్ధతులును నేటి మానసిక శాస్త్రవేత్త లంగీకరించునట్టివి కావు కావున బాలుని మానసికస్వభావమున కనువగునట్టిదొక పద్ధతిగలదు అదియే చూచిచెప్పు పద్ధతి. ఈ పద్ధతి ననుసరించి బాలురకు మొదటనే పదములను గాని, వాక్యములనేగాని మొత్తముగా నేర్పి తర్వాతనే యందలి యక్షరములను బాలుర చేత గుర్తింపఁజేయుట గమనించవల సిన విషయము బాలురతో మాటలాడు సమయములందును కథాకథన సందర్భములందును బాలురకే పదములును వాక్యము లును సుపరిచితములో వానిని గమనించి నల్లబల్లపై వ్రాసి యాపదములనుగాని, వాక్యములనుగాని బాలురచేతఁ జదివించ వలెను అది బాలురకర్థవంతముగఁ గన్పట్టును ఉద్దేశ కల్పన

మేర్పడును ఉపాధ్యాయుని యుచ్చారణము ననుసరించి తమకుఁ బరిచితములైనపదములను సులభముగాఁ జదువుటకు నందలి యక్షరములను సులభముగా గుర్తించుటకును నేర్చుకొందురు

చదువుటయందు బాలురకభిరుచిఁ గలిగించుటకై యుపాధ్యాయుఁడు బాలురచేతఁ జెప్పించిన కథలనుగాని, యందలి వాక్యములనుగాని, పదములనుగాని ప్రత్యేకముగా వ్రాసియుంచి వానికిఁ బ్రక్కనే వానికి సంబంధించిన చిత్రములను వేసి యుంచవలెను ఆ చిత్రముల సాయమున బాలురుసులభముగ నుత్సాహముతోను జదువ నేర్తురు ఈపద్ధతిననుసరించి బాలుర ప్రత్యేకాక్షరములను గుర్తించి చదువఁగలిగిన తర్వాత— అనగాఁ బాలురు మూఁడవ తరగతిలోనికి వచ్చిన తర్వాత— వారికక్షరముల నకారాదిక్రమమున బోధించి గుణింతములను సంయుక్తాక్షరములను నేర్పవలెను

ఈ పద్ధతియందు మూఁడంతర్భాగములు కలవు బాలురకు మొదట మాటలను జూపి చదివించి యందలి యక్షరములను వారు గుర్తించఁ గల్గునట్లు చేయుట మూలమున బోధించినచో నది పదపద్ధతి యందురు అట్లే మొదట బాలురకుఁ జూపు పఠన పత్రములయందు వాక్యములుండి యా వాక్యములను బాలురచేత మొదటఁ జదివించి యందలి వేర్వేఱు పదములను వారిచే గుర్తింపఁ జేసి పిమ్మటనొక్కొక్క పదమునందలి వేర్వేఱక్షరములను గుర్తింపఁ జేయుట మూలమున బోధించినచో నది వాక్యపద్ధతి యందురు పై రెండు

విధములుగాఁ గాక మొదటనే కథలుగల పరన పత్రములను బాలుర యెదుట నుంచి చదివించి యందలి వాక్యములను వేర్వేఱుగా వారిచేతఁ జదివించి యొక్కొక వాక్యమునందలి పదముల నొక్కొక పదమునందలి యక్షరములను బాలురు గుర్తించఁ గలుగునట్లు చేసినదది కథాపద్ధతి యందురు.

పదపద్ధతి ననుసరించుట కిదివరలోఁ గ్రీడాపద్ధతి సందర్భముందఁ జెప్పిన మోడిపుటట్టలును వాక్యపద్ధతి ననుసరించుటకుఁ బరన పత్రములును గథాపద్ధతి ననుసరించుటకుఁ జిన్న వ్రాత పుస్తకములు నుపాధ్యాయున కవసరము ఈ వ్రాతపుస్తకముల యం దుపాధ్యాయుఁడు తానాతరగతికిఁ జెప్పిన కథలను సామాన్యభాషలోఁ బెద్ద యక్షరములతో నొకప్రక్కను వ్రాసి యుంచి రెండవప్రక్క నాకథకు సంబంధించిన చిత్రమును వేసి యుంచవలెను ఈమూఁడిటి యందును బదపద్ధతికన్న వాక్య పద్ధతియు, వాక్యపద్ధతికన్నఁ గథాపద్ధతియు శ్రేష్ఠతరములని విద్యావేత్తల యభిప్రాయము పదములకన్న వాక్యములును వాక్యములకన్నఁ గథలును బాలురయనురక్తిని బెంపొందింపఁ జేయుటయే యందులకుఁ గారణము ఏపద్ధతి ననుసరించినను, ఉపాధ్యాయుఁడు బాలురు నేర్చిన యక్షరములను సరిగా గుర్తించుకొనుచు వారు మూఁడవతరగతికి వచ్చునరి కన్ని యక్షరములను నేర్పవలెను.

ఈ పద్ధతియందు శక్తి యల్పమనియు బాలురు తెలిసిన పదములను వాక్యములను గథలనే చదువఁగల్గుదురు గాని క్రొత్తవానిని గుర్తించఁగల శక్తి వారి కలవడదనియు వారి

రచనలలో వర్ణక్రమ దోషము లెక్కువగా నుండుననియుఁ గొందఱు విమర్శింతురు. ఈదోషము లీపద్ధతికిఁ జెందినవి కావు. సమర్థుఁడైన యుపాధ్యాయుఁడీ పద్ధతి నుత్సాహముతో నవలంబించి సంపూర్ణముగా నాచరించినచో నీవిమర్శనమున కవకాశముండదు సంపూర్ణముగా నాచరించుట యనినచోఁ గథాపద్ధతి నుపయోగించినపుడందలి వేఱువేఱు వాక్యములవందలి పదములను బ్రతిపదమునందలి యక్షరములను బాలురు విడివిడిగా గుర్తించఁగలుగునట్లు వారికభ్యాసము నిచ్చుటయు, వాక్యపద్ధతి నుపయోగించినపుడందలి వివిధపదములను బ్రతిపదమునందలి వేఱువేఱక్షరములను గుర్తింపఁజేయుటయుఁ, బదపద్ధతి నుపయోగించినపుడందలి యక్షరములను విడివిడిగా గుర్తించఁగల్గునట్లు చేయుటయు నని భావము వాచికచర్యా సందర్భమునఁ జెప్పఁబడినట్లు బాలురయుచ్చారణాదోషములను సవరించినచో వారి వర్ణక్రమము నిర్దుష్టముగా నుండును. సరిగాఁ బలుకఁగలవాఁడు సరిగా వ్రాయలేక పోఁడు

పదపద్ధతి యందుపయోగపడుటకై మూఁడు విధములగు మెఱపుట్టలను, వాక్యపద్ధతికిఁ బఠనపత్రములను గథాపద్ధతికిఁ గథాపుస్తకముల నుపాధ్యాయుఁడు సిద్ధము చేసికొనవలెనుగదా. ఇందే యుపకరణములైన నుపాధ్యాయుఁడు బాలురకు బోధించుటకుఁ జాలినన్ని కొలదిగాఁ గాక ప్రతిబాలుఁడును విడివిడిగా తనకు దానుపయోగించుటకుఁ జాలినన్ని యుండవలెను వానియందు వ్రాయఁబడిన పదములును, వాక్యములును గథలును బాలురకుఁ బరిచితములైనవిగా నుండవలెను.

బాలుని నిత్యానుభవములకుఁ జెందిన పనులనుగూర్చిగాని పశు పక్ష్యాదులను గూర్చిగాని యందు వ్రాసియుంచఁదగును సమస్యలు, సామెతలు, పొడుపుకథలు, నీతివాక్యములు నారోగ్య సూత్రములు, జోలపాటలు నభినయ గీతములు నిందులకుఁ బనికివచ్చును

ప్రాథమిక దశయందు బాలురకుఁ గలిగిన పఠన సామర్థ్యమును మధ్యమ దశయందభివృద్ధి చేయవలెను. ఉత్తమ పఠనమున కుండఁదగు ముఖ్య లక్షణములనుగూడ మధ్యమదశలో బాగుగా పరిణతిఁ బొందునట్లు చేయవలెను

ఇఁక మంచి పఠనమునకుండఁదగు ముఖ్య లక్షణము లేవో పరిశీలింతము అందు మొట్టమొదటి దర్థవంతముగఁ జదువుట. నిలుపవలసినచోట్ల నిలిపి చదివినచో నది యిందులకు సహాయపడును చదువువాఁడు దానినర్థము జేసికొనుచుఁ జదివిననే యది వినువారి కర్థమగును. రెండవ ముఖ్యలక్షణము స్పష్టత. కొన్ని యక్షరములను మ్రింగివేయుటగాని యస్పష్టముగ నుచ్చరించుటగాని కూడదు అవిచ్ఛిన్నముగ ధారాళముగఁ జదువుటగూడ నొక ముఖ్య లక్షణమే నట్లుపడుచుఁ జదివినయెడల వినుటకింపుగ నుండదు మిక్కిలి చిన్న గొంతుతోఁ జదువుటయు ననవసరమైనంత పెద్దగాఁ జదువుటయు లేక, తగినంత బిగ్గరగాఁ జదువుటయును, ఎచ్చట స్వరమునూది పలుకవలెనో, యెచ్చట తేల్చి పలుకవలెనో గమనించి చదువుటయు మఱికొన్ని మంచి లక్షణములు. పద్యములను జదివినవిధముగా

వచనమును జదువరాదు వచనమును జదువుట మాటాడినట్లే యుండవలెను

తరగతియందుఁ బఠన పాఠమును సాగించుటలో రెండు పద్ధతులవలంబించఁ బడుచున్నవి. బాలురందఱు నొకే పర్యాయము చదివించుటయొకటి. కాలమును కలిసివచ్చుటకై దీని నవలంబింతురు కాని యిది పూర్తిగాఁ బరిహరించఁదగినది ఏబాలుఁడు సరిగాఁ జదువుచున్నదియుఁ నెవఁడు దుష్టముగాఁ జదువుచున్నదియు నుపాధ్యాయుఁడు గమనించుటకు వీలు లేదు ఒక్కొక్కఁడు చదువక నోరు కదలించుచున్నను సరిపోవును గమనించుటకే వీలులేని దోషముల నుపాధ్యాయుఁడు సరి చేయలేఁడుగదా

సాముదాయిక పఠనమును గాదనిన పిదప నైయక్తిక పఠనమును గూర్చి తెలిసికొనవలసి యున్నది ఒక విద్యార్థి పుస్తకమును జదువుచుండఁ దక్కినవారు తమతమ పుస్తకములఁజూచుచుండుటయే దీనిలక్షణము దీని నెట్లనుసరించిన నుంచి ఫలితములు గలుగునో విచారింతము నేఁడు మన తరగతుల లో సరిగాఁ జదువఁ గలవారి సంఖ్యకన్నఁ జదువలేని వారి సంఖ్యయే హెచ్చు తరగతిలోని వారినందఱను వరుసగా నొక్కసారి చదివించితిమేని ప్రతిబాలుఁడును సాధుపఠనమును విన్నంతకన్న నసాధుపఠనమునే యెక్కువగా వినియుండును. ఎక్కువకాలము వినినదాని ప్రభావమే యెక్కువగానుండుటలో నాశ్చర్యమేమి? ఫలితము బాలుర పఠనశక్తి యభివృద్ధి జెందుటకు మారుగ క్షీణించుటయే యగుచున్నది. ఇందులకుఁ

గారణము బాలు రింటియొద్దఁ బ్రయత్నము చేయకయే తరగతిలో మొదటిసారి చదువుటయే అట్టి వారు వినువారికి విసుగును గలిగించి వారికిఁగల పఠనాభిలాషను గూడ నశింపఁ జేయుదురు ఈ చెడుగును నివారించవలెనన్న నుపాధ్యాయుఁడు బాలుర నింటియొద్ద ముందుగనే చదువుకొని రావలసినదిగాఁ గోరవలెను ఏ బాలుఁడు చదువుటను వినినందువలన మిగిలిన వారికిఁ దమంతఁ దామే చదువుకొనినప్పటికంటె యెక్కువ లాభముండునో అట్టి బాలునికే తరగతిలోఁ జదువుట కవకాశ మియ్యవలెను అప్పుడప్పుడు నుపాధ్యాయుఁ డాదర్శపఠనమును గావించుచుండవలెను అప్పుడు బాలురకుఁ జదువుట యొక యానందముగాను వినుటయొక వేడుకగాను బరిణమించును. బాలురలోఁ గొందఱి యందేవేని యొకటిరెండు పఠనసంబంధ దోషములుండినను నవి క్రమముగాఁ దమయంతనే చక్కఁ బడును.

## మౌన పఠనము

విద్యావంతులు చేయు పఠనము సాధారణముగ మౌన పఠనముగనే యుండును. వాగింద్రియములగు నాలుక, పెదవులు మొదలగు వానిని గదిలించక పుస్తకమును జూచుచుఁ ధ్వని లేకుండఁ జదువుటకు మౌనపఠనమని పేరు విద్యార్థికి భావి జీవితమందిది మిగుల సహాయకారిగా నుండును కావున దీని యందు విద్యార్థికి మంచి శిక్షణ మధ్యమ దశయందీయవలసి యున్నను ప్రాథమిక దశయందే యందులకుఁ బునాదిని వేయవలెను

దీనివలనఁ బ్రయోజనములేవో చూతము ప్రకాశపఠనమునకన్న మౌనపఠనమునకుఁ దక్కువకాలము పట్టును వాగింద్రియములకు శ్రమ లేకపోవుటచేత మౌనపఠనము నెక్కువకాలము చేయఁగలుగుదుము చదువువాని దృష్టి శబ్దోచ్చారణముమీఁదఁ గేంద్రీకరించఁబడక యర్థగ్రహణము మీఁదనే యుండుటచేత భావము సులభముగా బోధపడును మౌనపఠనము జ్ఞానార్జనమునకు నానందానుభవమునకును మిక్కిలి వీలుగనుండి భావిజీవితమునందు మిక్కిలి సహాయకారిగా నుండును చాలనుండి చదువుకొనవలసిన గ్రంథాలయములు మున్నగుచోట్ల నిది సాంఘికముగా మిక్కిలి ప్రయోజనకారి. మౌనపఠనము చేసినతర్వాతఁ బ్రకాశపఠనము జేసినచో నది మిక్కిలి చక్కగానుండును

మొదటమొదట బాలుర నేత్రములు పుస్తకమువంకఁ జూచుచున్నను, వారిమనస్సు మఱొకచోట సంచరించుచుండ వచ్చును అభ్యాసవశమున విషయగ్రహణముపై మనస్సు లగ్నమగుట యేర్పడును.

మౌనపఠనమువలనఁ గలుగు ప్రయోజనములను దృష్టి యందుంచుకొని సందర్భమును బట్టి పఠనాంశమునందున్న క్రొత్తపదముల కర్థమును దెలిసికొనుటయందును, భావము నందే మనస్సునులగ్నము చేయుటయందును, గొలఁది కాలములో నెక్కుడు విషయములను బఠించుటయందును విద్యార్థులు శ్రద్ధ వహించునట్లు చేయుటకై తగిన యభ్యాసములను వారికీయఁ దగును. మౌనపఠనమునకై నిర్ణయించఁబడిన యంశములా

తరగతికి బోధించు పాఠ్య గ్రంథములకన్న సులభములుగను గ్రొత్తపదము లధికముగ లేకుండ నుండవలెను

రెండవతరగతినుండి యీయభ్యాసముల నీయవచ్చును. చిన్నచిన్న పత్రములపై (కూర్చుండుఁడు'–'లెండు' మొదలగు) నాజ్ఞావాక్యములను వ్రాసియుంచి యుపాధ్యాయుఁడు వానిని జూపఁగనే శీఘ్రముగ బాలురావిధమునఁ జేయవలసి నదిగాఁ గోరవచ్చును చిన్నచిన్న వాక్యములను— నాలుగైదు పదములుగల వానిని— జూపి బాలురందలి యాజ్ఞలను మౌన ముగాఁ బాటించునట్లు చేయవచ్చును

మూఁడవతరగతికి మూఁడు నాలుగు చిన్నచిన్న వాక్య ములుగల సమస్యలనిచ్చి మౌనముగా వానికిఁ దమ పలకలపైఁ గాని నల్లబల్లపైఁగాని సమాధానములను వ్రాయించుటయుఁ, గథా పత్రములయందుఁ గొన్ని పరిచ్ఛేదములను నాలుగైదు వాక్యములకన్న నెక్కువ లేనివానిని— మనస్సులోఁ జదువు కొనవలసినదిగాఁ జెప్పి తరువాత నందలివిషయమును బ్రశ్నించి సమాధానములను జెప్పించుట లేక వ్రాయించుటయుఁ, గొన్ని పరిచ్ఛేదములలో లోపించిన మాటలను బూర్తిచేయిం చుటయు (ఇవి వారి పాఠ్య పుస్తకములలోనివేగాని వారికిఁ బరిచితములైన యితరములుగాని కావచ్చును) మొదలగు నభ్యాసముల నీయవచ్చును. పాఠ్య గ్రంథములనుండి కూడ సులభములగు పరిచ్ఛేదములను గొన్నిటి నుపయోగించుకొన వచ్చును

నాలుగైదు తరగతులవారికిఁ గథాపత్రములను దరగతి పాఠ్యగ్రంథములందలి పాఠములలో సులభములగు కొన్నిభాగములను మౌనపఠనాభ్యాసమునకుఁ దీసికొనవచ్చును

ఇట్లు క్రమముగా బాలురయొక్క దృష్టి పదములనుండి వాక్యములమీఁదికినిఁ బరిచ్ఛేదముల మీఁదికిని వ్యాప్తి జెందుటకుఁ బ్రయత్నము చేయవలెను వారు చదువునపుడు పైకి శబ్దమగుచున్నదియు, లేనిదియు వారిలో వారే చూచుకొనుటకుఁ దగిన యేర్పాట్లు చేయవలెను ఇతరులు పెద్దగాఁ జదువుకొనుటవలనఁ దనకు విషయగ్రహణముఁ జేసికొనుచుఁ జదువుట యెట్లు కష్టమగునో ప్రత్యక్షముగాఁ జూపుటవల్లను, మౌనముగానొకపాఠమును జదువుటకును బ్రకాశముగాదానినే చదువుటకును బట్టుకాలములోని వ్యత్యాసమును గనునించునట్లు చేయుటవలనను బాలురకు మౌనపఠనమెట్లు ప్రయోజనకారియో యర్థమగునట్లు చేసి వారి కుద్దేశ కల్పనముఁ జేయవచ్చును

పరిచ్ఛేదములను బ్రమాణముగాఁ దీసికొని బాలురు మౌనపఠనముఁ జేయఁగల శక్తి యేర్పడినపిదప వారి పఠనశక్తిని బరిశీలించుటకుఁ గొన్ని నికషల నేర్పాటుచేయఁదగును విషయము నర్థముఁ జేసికొనుచు వేగముగాఁ జేయుటయే మౌనపఠనము యొక్క ఫలితముగాన బాలుఁడెంత కాలములో నిర్ణీతమగు నంశమును జదువఁగల్గినదియు నెంతవఱకర్థముచేసికొనినదియుఁ బరిశీలించఁదగును నియమిత పాఠ్యాంశమును జదువుట కెన్నినిముసములు పట్టునో చూచి నిముసమున కెన్ని

మాటలు జదువఁ గల్గెనో లెక్కించిన నది పఠన వేగమగును. చదివిన విషయముపైఁ బ్రశ్నించి యెన్నిప్రశ్నలకెన్ని సరియైన నట్టి సమాధానముల నిచ్చెనో చూచి నూటికి వాని విషయ గ్రహణశక్తి యెంతయో నిర్ణయించవచ్చును ఇట్లు రెండు వారముల కొకపర్యాయమైనఁ బరీక్షించుచు నాఫలితమును నూఱుపట్టులను దరగతి గదులయందుఁ దగిలించి యుంచవలెను

మధ్యమ దశయందలి బాలుర కభ్యాసమునకై ప్రత్యేకముగా సిద్ధము చేయఁబడిన కొన్ని పత్రముల నప్పుడప్పుడు ప్రభుత్వమువారు ప్రకటించు ప్రకటనలను, వార్తాపత్రికలలోని వ్యాసములను కొన్ని మాసపత్రికలను బాలుర కుపయోగించునట్టి చందమామ మొదలగునవి, చిన్న కథలు కథానికలు గల గ్రంథముల నుపాధ్యాయుఁడు సిద్ధము చేసికొని యుండవలెను. ఇందు సులభముగా నందువాని నాలుగైదు తరగతుల కుపయోగించవచ్చును. తరగతి కంతటికిని విడివిడిగా నభ్యాసమున కవకాశము నిచ్చుటకై యీ పత్రములు మొదలగు వానిని విడివిడిగా ననేకముగా నుంచుకొనవలెను.

## పఠనోద్దేశము

బడియందు విద్యార్థులు మాతృభాషయందుఁ గొంత వచనభాగమును గొంత పద్యభాగమును నిశితముగాఁ జదువుచున్నారు. కొంత వ్యాకరణమును నేర్చుకొనుచున్నారు మఱి కొన్ని గ్రంథముల నుపవాచకములుగాను గొన్నిటిని గ్రంథాలయములనుండియుఁ జదువుచున్నారు. వార్తాపత్రికలు మొదలగువానిని గొన్నిటిని జదువుచున్నారు. వీనిని జదివినను లక్ష్యములు మాత్రము పలు విధములైన విషయములను

గ్రహించుటయు నానందోపేతమైన యనుభవమును సంపాదిం
చుకొనుటయు నుత్తమమగు భాష నలవఱుచుకొనుటయు నై
యున్నది. గానపానము జేయునపుడు గూడ నుద్దేశ మింత
కన్న భిన్నముగాదు ఈయుద్దేశములు నెఱవేఱకున్న మాత్ర
భాషాబోధన సరిగా జరిగినదని చెప్పుటకు వీలులేదు ఇవి నెఱ
వేఱుటకుపాధ్యాయుడు బోధింపవలసిన విధానమెట్లుండవలె
ననుట పరిశీలనార్హము.

# పద్యబోధన

మొదట బద్యబోధనను గూర్చి తెలిసికొందము నేడు
మన పాఠశాలలయందు బద్యము లిట్లు నేర్పబడుచున్నవి.
ఉపాధ్యాయుడు పద్యమును జదువును అందలి పదములను
ఛేదించుచు బదవిభాగము జేయును. ప్రతి పదమునకు నర్థ
మును జెప్పును. మధ్యమధ్య వచ్చు వ్యాకరణము నప్పటి
కప్పుడే బోధించును పద్యమును దాని యర్థతాత్పర్యములను
వల్లెవేయించుటగూడ జేయును అనగా నెక్కుడు ప్రాధాన్య
మును ప్రతిపదార్థమునకును వ్యాకరణ విశేషములకునిచ్చును.

ఇట్లు చేయుటకు గారణము పద్యమునకును గద్యమున
కును గలభేదమును గమనించి దేనిని బోధించునపుడేలక్ష్యము
నెఱవేఱునట్లు చూడవలెనను విషయముపై శ్రద్ధ జూపక
పోవుటయే. పద్యము దాని యంతస్సారమున వచనముకంటె
వేఱైనది రమణీయమైన యర్థముగలది రసాత్మకమైనట్టిది.
మొత్తముగా గ్రహించినపుడుగాని పూర్ణస్వరూపము గమనిం

చుటకు వీలు కానిది ఒక దివ్య భవనమువంటిది ఆభవనమునం దుపయోగింపఁబడిన రాళ్ళను, సున్నమును, కొయ్యల నితర వస్తువులను దేనికది వేఱుచేసి చూచినపుడు కాక మొత్తముగా భవనమును జూచినపుడే దాని సౌందర్యమును మనము గ్రహింపఁగల్గుదుము అట్లే పద్యముకూడ తగిన పద్యములను బోధనకు గ్రహించకపోవుటయు నొకలోపముగనే యుండును. ఛందోబద్ధములైనంతనే యారచనలు (బోధించఁదగు) పద్యము లనిపించుకొనవు

పద్యబోధన యనఁగఁ బద్యమునందలి రమణీయార్థము ను గమనింపఁజేయుటయు నందలి రసము నాస్వాదింపఁ జేయు టయు నని యెఱుఁగవలెను అర్థపుష్టికై పదములును వాని కలయికయు నెట్లుతోడ్పడినవో తెలియఁజేయుటయుఁ బద్యము నడకను గమనింప జేసి యట్టి రచనలయందు బాలుర కభిరుచిఁ గల్పించుటయుఁ బసప్రాయమున వారిలో సారస్వతమును జదువవలెననెడి యభిలాషను బెంపొందించుటయును బద్య బోధనా లక్ష్యములే. పద్యమును విభాగము చేయుటయుఁ గొంత చెప్పి వ్యాకరణాంశము రాఁగానే పద్యబోధనను నిల్పి వ్యాకరణమును బోధించుటకుపక్రమించుటయుఁ నై లక్ష్య సాధనకుఁ బ్రబలమగు నాటంకములు.

ఆ యుద్దేశములు నెఱవేఱవలెనన్నఁ బద్యము నెట్లు బోధించవలెనో సూత్రము పద్యమునుగాని పద్యమాలికనుగాని మొత్తముగాఁ దీసికొనవలెను ఒక్కొకప్పుడొక భావ మొకే పద్యము నాశ్రయించియుండక యెక్కువ పద్యములందుండును.

అప్పుడాపద్యముల నన్నిటినీ కేవల ప్రమాణముగాఁ దీసికొనవలసి

ఇతర పాఠ్యాంశములను బోధించునప్పటివలె మొదట బాలురను బోధన కున్ముఖులనుగా జేయవలెను. బోధించఁ బోవు విషయముతో సన్నిహిత సంబంధములుగల దానిని బాలుర మనస్సులయందు దేని ముందే యుంచునని యుపాధ్యాయునకుఁ దోఁచునో యా పూర్వజ్ఞానమును బాలురయొద్దనుండి రాఁబట్టవలెను. అంతట దానితో సంబంధముగల నా పాఠ్యాంశమునకుఁ దగిన శీర్షికను బ్రకటించి దానిని నల్లబల్లపై వ్రాయవలసి యుండును.

అనంతర ముపాధ్యాయుఁడు తానే పద్యాంశమును వచనమును ఛందోబద్ధమగు రచనను జదివినట్లు గాక ఒకపర్యాయము భావము సులభముగా బోధపడునట్లును జదువవలెను. ఛందోబద్ధమగు రచనను జదివినట్లు చదువుట యున్న సంగీతమునకుఁ బ్రాధాన్యము నిచ్చుటకాదు. పద్యము సహజముగను వచనమునకన్న భిన్నముగదా. అందుచేత వచనమును జదివినట్లు చదువరాదనియే కాని సంగీతసభగా మార్చుమని కాదు. రసవంతమగు పద్యమును గొందఱు చదివినపుడు వినువారికి రుచించకుండుటయు రసహీనమగు పద్యమైనను గొందఱు చదివినపుడు (సంగీత మాధుర్యముచేత) వినవలెననిపించుటయు మనకుఁ దెలియనిది కాదు. పద్యములు భావమును రసవంతముగ వెల్లడించుచు సులభముగా జ్ఞప్తియుంచుకొనఁదగినట్లు ఛందోబద్ధములుగా రచించఁబడినవే కాని యన్యముగాదు. సంగీతమునకు సహాయకారులుగా రచించఁబడినవి పాటలు

మొదలగునవియే కాని పద్యములుగాదు. కావున రాగమున కవ్యోక స్థానమే లేదు.

ఉపాధ్యాయుఁడు చదివి వెంటనే విద్యార్థులచేతఁ జదివించరాదు. పద్యమును జదువుట వచనమును జదువుట వలె సులభముగాదు. పద్యమునందలి యన్వయము వచనమునం దున్నట్లుండదు. పద్యగత విషయము విద్యార్థులకుఁ జక్కఁగా నర్థమైనచో వారు దానిని జదువఁగల్గుదురు. అందుచేత బోధన మైనతర్వాతనే బాలురచేతఁ బద్యములు జదివింప వలెను.

ఉపాధ్యాయుఁడు పద్యమును జదివిన పిమ్మట పద్యము నందలి ప్రధానాభిప్రాయమును బాలురయొద్దనుండి రాఁబట్ట వలెను. తర్వాత వివరములతోఁ గూడిన పద్యబోధన యందలి ప్రతియంశమును సాధ్యమైనంతవఱకు బాలురయొద్దనుండియే రాఁబట్టుటకుఁ బ్రయత్నము చేయవలెను. క్రొత్తపదముల కర్థము నెప్పటికప్పుడు బోధించుచుండవలెను. ఈ క్రొత్తపద ముల కర్థబోధనఁ జేయుటకుఁ గూడఁ గొన్ని పద్ధతులు గలవు. ఆమాటను బాలురకుఁ బరిచితమైన సందర్భమునం దుపయోగించుటచేత బాలురే యా పదమున కర్థమునూహించి చెప్పఁ గలుగుదురు. కొన్ని మాటల కర్థముఁ జెప్పుట కామాటకుఁ దగిన బొమ్మను జూపుటవలన సులభముగా సాధ్యమగును. మాటలమూలముననే యర్థముఁ జెప్పవలెనన్న నాయర్థము మిక్కిలి దీర్ఘముగుటయు నయ్యు, బాలురకు మనస్సున కెక్కక పోవుటయు జరుగును 'దృశ్యము' అను పదమువంటి వాని

నిట్లు బోధించుట తగును కొన్ని పదములకు వ్యతిరేక పదములను జెప్పుట మూలమునను మఱికొన్నిటికి సమాన పదములను జెప్పుటవల్లను సులభముగా బోధించుటకు వీలగును. ఆ పదమే వస్తువును దెలియఁజేయునో యావస్తువునే చూపుటకు వీలైనచో నట్లును జేయవచ్చును ఎట్లను సాధ్యముకాని మాటపైఁ గాలహరణము చేయక యుపాధ్యాయుఁడే చెప్పుట మంచిది కొన్నిపదములు కొన్ని ప్రత్యేక సందర్భములయందే వాడఁబడును అట్టి పదములను నేర్చుకొనునపుడా సందర్భములను గూడఁ దెలిసికొనవలసి యుండును అర్థము పదముకన్న సులభముగా నుండవలయును కొన్ని క్రియాపదముల నందలి యర్థమునకు సరిపడు నభినయమును జేయుటవలన బోధించవచ్చును

ఇట్లు కఠినపదముల కర్థమును బోధించుచుఁ బ్రశ్నోత్తరముల మూలమునఁ బద్యమును నేర్పుచున్నపుడందు నను వ్యాకరణాంశములున్నను వానిజోలికిఁ బోరాదు ఏలయనేని రసభంగమగును బాలురకుఁగూడ నది సహించరానిదగును ప్రతిపదార్థమును జెప్పుటయుఁ గూడదు ఆ పద్యమువలన మనస్సునకే యభిప్రాయ మందఁజేయఁబడవలెనో యా యభిప్రాయమును బాలురు తెలిసికొనునట్లుగఁ జేయవలెను.

పై విధమునఁ బద్యబోధన చేయునపు డుపాధ్యాయుఁడెప్పుడు బోధించిన కఠినపదముల కర్థముల నప్పుడే నల్లబల్లపై నొకవైపున లిఖించుచుండవలెను పద్యమంతయు బోధించుట కాఁగానే యందలి భావమును చిన్నచిన్న వాక్యములలోఁ

డిగిన ప్రశ్నల మూలముగ బాలురకడనుండి రాబట్టుచు నా భాగమును విస్పష్టముగా నల్లబల్లపై వ్రాయుచుండవలెను. నల్లబల్లపై వ్రాసిన యంశములను బాలురు తమ వ్రాత పుస్తకములలో వ్రాసికొందురు.

యతి ప్రాసలవలనను బద్యమున నుపయోగించిన పదములవలన (యమకము మొదలగునవి) నొక ప్రత్యేకజాతికిఁ జెందిన పద్యముల వలనను గల్గిన సొంపును బాలురు గ్రహించునట్లుగ శిక్షణ నీయవలెను. ఈవిధముగఁ బద్యమును బాలురు మెచ్చుకొనునట్లు మధ్యమదశలో శిక్షింపఁదగును.

పిమ్మటఁ బద్యము నింకొకసారి యుపాధ్యాయుఁడు చదివి యప్పుడు బాలురచేతఁ జదివించవలెను. బాలురు సరిగాఁ జదువఁగల్గినపుడే యుపాధ్యాయుని బోధన సఫలమైనట్లు.

బోధించఁబడిన పద్యములలోఁ గొన్ని యందలి సొంపు చేత నేమి, నీతిచేత నేమి, లోకోక్తులచేత నేమి, అలంకారము చేత నేమి మఱి యేయితర గుణముచేత నేమి బాలురకుఁ దమ జీవితకాలమందంతయు జ్ఞప్తియుంచుకొనఁదగినవిగా నుండును. అట్టి పద్యముల నుపాధ్యాయుఁడు సరిగా నెన్ని బాలురు వానినిఁ గంఠస్థముఁ జేయునట్లు చూడవలెను. సక్రమముగా బోధించుట జరిగినచోఁ బద్యబోధన ముగియుసరికే చాల పద్యములు కొందఱు బాలురకు వల్లించుటకు వచ్చును. అర్థమయినపద్యము లను వల్లించుట మిక్కిలి సులభముగదా.

బాలురకే తరగతియందెట్టి పద్యములను నేర్పఁదగునో కొంత యాలోచింతము. ఒకటి రెండు తరగతులయందలి బాలురకు లాలిపాటలును, జంటిబిడ్డలకుఁ బాడునట్టి శ్లోక

పాటలు, నభినయ గీతములును, జానపదులుపాడు కీర్తనములును, ద్విపదలును నేర్పఁదగును రెండవతరగతియందుఁ గొలఁదిగాఁ గట్టు పద్యములును బోధించవచ్చును ప్రాథమిక దశయందలి పైతరగతులయందు సులభములగు వర్ణనాయు నీతిని బోధించునట్టివియు నగు పద్యములను కృష్ణుని చిన్ననాట చేష్టలవంటి బాలుర నాకర్షించునట్టి యంశములుగల పద్యములను గథలుగానున్న పద్యములను సమస్యలను దెల్పు పద్యములను సులభములుగా నుండు చాటు పద్యములను క్రమముగా బోధించనగును

మధ్యమ దశయందలి బాలురు మానసికముగాఁ గొంచె మభివృద్ధిఁ జెందియున్నారు. కావున వారికి వర్ణనాత్మకములగు పద్యములను బూర్వపు వీర గాథలను దెలియఁజేయు గీతములను బూర్వకవులు వ్రాసిన గ్రంథములందలి కొన్ని ఘట్టముల నాధునికులు వ్రాసిన పద్యములను కొన్నిటిని నేర్పందగును. సంవాదములు మొదలగు వానిని దెలియఁజేయు పద్యములను (ఉ. హంస సంవాదము) నీతిబోధకములగు చాటువులను, ద్విపద గ్రంథముల నుండి కొన్ని యంశములను శతకనీతి పద్యములనుండి కొన్నిటిని నేర్పందగును.

## వచన బోధ

వచనమును బోధించుటలో లక్ష్యములు పద్యబోధనా లక్ష్యములకన్నఁ గొంత భిన్నముగానుండును ఇయ్యెడ బాలురు పాఠ్యాంశమును గ్రహించి యందలి భావమును దమ సొంత వాక్యములలో వెల్లడించఁగల్గుటయు నందలి పదముల యర్థమును గ్రహించుటతోఁ దృప్తిపడక (పద్య పాఠమునందలి నూతన పదముల కర్థముఁ దెలిసికొనినఁ జాలును) వానిని

ప్రయోగించుటకుఁ గూడ నేర్చుకొనుటయు లక్ష్యములు నీతి చంద్రికవంటి గ్రంథములలో నచ్చటచ్చటఁ గల కొన్ని యుత్తమము లగు గద్యభాగములను గంఠస్థముఁ జేయించుటయు నభిలషణీయమే ఈవిధముగఁ జేయుటవలన బాలురకు సారస్వతము నందభిరుచిని గూడఁ గల్గించవచ్చును

గద్యబోధయందును ప్రారంభమునఁ బద్యబోధయందు వలె బాలురయొక్క పూర్వజ్ఞానమును— ప్రస్తుతాంశమునకు సంబంధము గల దానిని— దాని వెంటనే శీర్షికా ప్రకటనముఁ జేయవలెను. అటుపిమ్మట నుపాధ్యాయుఁడాదర్శ పఠనమును చేసి వెంటనే బాలురలోఁ గొందఱిచేతఁ జదివించవచ్చును పద్యపాఠమునందున్నట్లు వచన పాఠమునందును గొన్ని కఠినపదములున్నను నన్వయక్లిష్టత యుండకపోవుటచేత (వాక్యనిర్మాణము వచనమునందు పద్యమునందున్నట్లుండదు) బాలురుతమకర్థముగాకున్నను సరిగాఁ జదువుటలోఁ గుంటుపడ నవసరము లేదు అట్లొక్క పర్యాయము బాలురలోఁ గొందఱిచేతఁ జదివించిన తర్వాత బాలురందఱు నందలి కేంద్రాభిప్రాయమును గ్రహించుటకై వారిచే రెండుమూఁడు నిముసముల కాలము మౌనపఠనముఁ జేయించవచ్చును పద్యబోధనా సందర్భమున మౌనపఠనమే లేదు.

ఇంతటఁ బాఠ్యాంశమును గుఱించి బాలురను దగిన విధమునఁ బ్రశ్నించి సమాధానములను రాఁబట్టుచుఁ గఠిన పదములను (ఇదివఱలోఁ జెప్పఁబడిన విధమున) బోధించుచుఁ పాఠబోధఁన జేయవలెను. ఆక్రొత్తమాటలలోఁ గొన్ని— నిత్య

జీవితములోఁ దఱచుగా వచ్చునవి— బాలురు ప్రయోగించఁ గలుగునట్లు వారికిఁ దగిన శిక్షణ నీయవలెను ఈ ప్రయోగాభ్యాసము పద్యబోధనా సందర్భమున ననుసరించఁ బడదు. ఇట్టి పదముల కర్థమును బోధించిన వెంటనే సందర్భాంతరమును బాలురకిచ్చి వారా సందర్భమునందా పదము నుపయోగించి వాక్యముఁ జెప్పునట్లు శిక్షణ నీయఁదగును. పద్యమును గాని పద్యమాలికనుగాని బోధించునపుడు మొత్తముగనే యొక ప్రమాణముగాఁ దీసికొందుము వచన విషయమున నొక్కొక పరిచ్ఛేదమే యొక ప్రమాణము పద్యబోధనలోవలెఁ గాక వచనమును బోధించునెడ బోధన జరుగునపుడే నూతన పదముల కర్థమును వ్రాయుట యొకవైపును పాఠముయొక్క భావమును వ్రాయుట మఱొకవైపును జేయుటచేత నల్లబల్ల సారాంశమును బూర్తి చేయవలెను. ప్రస్తుతాంశమునకు సంబంధించిన యితర విషయములను, దృష్టాంతములను జెప్పుట రెండు పాఠముల యెడను సమానమే.

ఈవిధముగాఁ బాఠము బోధించిన వెంటనే నల్లబల్లను దుడిచి యానాఁడు బోధించిన యంశముపై బాలురను ప్రశ్నించవలెను. వారు సరిగా సమాధానములను జెప్పిననే వారికి విషయము బోధపడినట్లు

## ఉపవాచకములను బోధించుట

మధ్యమ దశయందలి బాలురకు వాచకములతోఁబాటు ఉపవాచకములు గూడ నిర్ణయించఁబడును. బాలుర తమ జ్ఞానాభివృద్ధిని జేసికొనుట

కును, సొంతముగాఁ జదువుకొనఁగల శక్తిని బెంపొందించుకొనుటకు నానందము నొందుటకును దీరిక వేళలయందును దగిన పనిని గల్పించుకొనుటకును పదజాలము నభివృద్ధిఁ జేసికొనుటకు నియ్యవి యుపయోగపడుచున్నవి. ఈ యుద్దేశములు నెఱవేఱవలెనన్న నివి యేతరగతికి నియమింపఁబడినవో యా క్రింది తరగతియొక్క వాచకముల శైలికి సమానమగు శైలిని గలిగి యుండవలెను. ఇవి వాచకములవలెఁ దరగతిలో బోధించఁబడరాదు. ఇందలియంశమునకుఁ దగిన యుపోద్ఘాతమును మాత్రముపాధ్యాయుఁడు తరగతిలోఁ జెప్పి బాలురాంధను జదువవలెననెడి యభిప్రాయము వారికే కలుగునట్లు చేయవచ్చును. వారు చదివినదియు లేనిదియుఁ దెలిసికొనుటకుఁ దర్వాతఁ గొన్ని ప్రశ్నలనిచ్చి సమాధానముల వ్రాయించుటగాని దానికి సంబంధించినట్టి వ్యాసములను వ్రాయించుటగాని చేయవచ్చును. ఈ పుస్తకములయందుఁ గ్రొత్తమాట లెక్కువగా నుండరాదు.

ఎత్తుగడ పద్ధతిని డాల్టను విధానము ననుసరించుట మూలమునను దోఁటపనినిఁ జేయించు సందర్భమునను గొన్ని విషయములను గొంత చెప్పి మిగిలిన వానిని బాలురే చదువుకొనుటకుఁ బ్రోత్సాహముఁ గల్గించుట మూలమునను, వ్యాసములు వ్రాయించుట వలనను, వక్తృత్వమునందు శిక్షణము నిచ్చుట మూలమునను, గ్రంథాలయములలోని పుస్తకములను బత్రికలలోని వార్తలను జదువునట్లు పురికొల్పుట మూలమున నుపాధ్యాయుఁడు బాలురయందు విస్తృత పఠనాభ్యాసమును బెంపొందింపఁ గల్గును. ఇట్టి యభ్యాసము బాలురకు భావిజీవితమునందు మిక్కిలిగా నుపకరించుననియు మానసిక శక్తిని వృద్ధి చేసికొనుటలోఁ దోడ్పడుననియుఁ బ్రత్యేకముగాఁ జెప్పఁ బనిలేదు.

## పాఠ్యగ్రంథముల లక్షణములు

ఇతర పాఠ్యాంశములను బోధించునప్పటికంటె భాష

ను బోధించునట్లుఁ బాఠ్యగ్రంథము లెంతేని యవసరము. ప-
నము నారంభించినప్పుడితరములగు నుపకరణముల మూలమున
బాలునకు దీనిని నేర్పినప్పటికిని గొన్ని యక్షరముల బాలుఁడు
చక్కఁగా గుర్తించఁ గల్గిన తర్వాతనే పాఠ్య పుస్తకము
నుపయోగించుట యవసరమగుచున్నది. బాలుర పఠనశక్తిని
వృద్ధిఁ జేయుటకును పదజాలమును బెంపొందించుటకును వివిధ
విషయములఁ గూర్చిన జ్ఞానమును వారికందించుటకును బాఠ్య
గ్రంథములవసరము. భాషాగ్రహణ శక్తిని, స్వతంత్రాలోచనా శక్తులఁ
బెంపొందించుటకును, వ్యాకరణ విశేషములఁ దెలియఁజేయుట
కును, సారస్వతమునందభిరుచిఁ గల్గించుటకును పాఠగ్రంథము
లుపయోగపడుచున్నవి.

ఈ ప్రయోజనములను సాధింపవలెనన్న నాయాతరగ
తుల పాఠ్యగ్రంథములలో నధికావృత్తిగల పదజాలమును
క్రమముగాఁ బ్రవేశపెట్టవలెను. పాఠములు వివిధములై
విషయములను గూర్చి వ్రాయఁబడినవిగా నుండవలెను. భాష
సరళముగా నుండఁదగును. క్రొత్త పదములను బ్రవేశపెట్టుట
లో నియమము లుండుటచేత నవి సారళ్యమున కడ్డురావు.
తరగతియందు బాలుఁడు నేర్చుకొనవలసిన క్రొత్త పదములు
పుస్తకమందలి యన్ని పాఠములలో నన్ని పరిచ్ఛేదములలోను
సమముగా విభజించి యుండవలెను. సారళ్యమును సంపాదిం
చుటకై గ్రాంధిక భాషకు స్వస్తి చెప్పరాదు. సరళమైన
గ్రాంధికభాషనే వాడఁదగును. గద్యభాగమునకును పద్యభాగ
మునకును వానికిఁ దగిన స్థానములుండవలెను. పాఠములు

మతి సౌఖ్యరస్యమును బోధించవలెను. హాస్యరసముతోఁగూడిన యుపాఖ్యానములు బాలురకుఁ బ్రీతిపాత్రములుగనుండును.

మధ్యమ తరగతులందలి పాఠ్యగ్రంథములు గూడ నట్టే యాకర్షణీయములైన పాఠములు వ్రాయఁబడినవిగా నుండి ప్రసిద్ధ కవులయొక్కయు, రచయితలయొక్కయు రచనలనుండి తీసికొనఁబడినట్టి రచనలనుగూడఁ గొన్నిటిని కలిగియుండవలెను. అందుచేత నొకే గ్రంథకర్త యొక్క రచనలను జదువుట వలనఁ గలిగిన విసుగుదలల నివారింపఁజేయఁబడుటయేగాక వివిధ రచనల శైలులలోఁ నభిరుచి యేర్పడుట గూడఁ దటస్థించును.

ఇప్పటికిఁ జెప్పఁబడినది పాఠ్యగ్రంథాంతరవిషయము. దాని బాహ్య స్వరూపమునుగూర్చి యొకమాట అందలి యక్షరములు తగినంత పెద్దవిగ నున్ననే బాలురకుఁజదువవలెననెడి కోరికపుట్టును. ముఖ్యముగాఁ జిన్నతరగతుల పుస్తకములందలి యచ్చు పెద్దదిగా నుండవలెను మొదటి రెండు తరగతుల వాచకములలో నొక్కొక పంక్తికి నొకే వాక్యముండుట మంచిది. వాక్యము ముగిసిన తర్వాత నాపంక్తిని ముగించవలెను పటములు– ముఖ్యముగాఁ గ్రిందితరగతులలో– తగినన్ని యుండవలెను పాఠములందున్న పటములందలి ముఖ్యములగు సన్నివేశములను జూపునవిగా నుండవలెను. బొమ్మలు పుటల మధ్యమునఁగాని వాక్యములలోనికిఁ జొచ్చుకొనిపోయిగాని యుండరాదు పాఠములు పెద్దవిగా నున్నచో బాలురకు విసుగేర్పడును. క్రిందితరగతులనుండి పైతరగతులకుఁ బోనఁబోను పాఠములు పెద్దవగుచుండవలెను పుస్తకము యొక్క బయటిరూపము (Get-up) బాలుర నాకర్షించునట్టిది

గా నుండవలెను. అచ్చుతప్పులు బొత్తుగా నుండరాదు అచ్చు వేయఁబడిన యక్షరములు బాలురకు శాసనములవలెనుండును

ఇట్టి పాఠ్య గ్రంథములు బాలుర కుపయుక్తములుగా నుండుటయేగాక యుపాధ్యాయునకుఁ గూడ బోధనకుసహాయముగా నుండును. పాఠ్యగ్రంథము లేకుండ నుపాధ్యాయుఁ డెప్పటి కప్పుడు పాఠములను సిద్ధము చేసికొని బోధించుట మిక్కిలి కష్టము. అట్టి సమర్థులగు నుపాధ్యాయులు గూడ మిక్కిలి కొద్దిమంది యుందురు పాఠ్యగ్రంథములు విరివిగాఁ బ్రచారములో నుండుట గూడ వాని యవసరము నే తెలియఁ జేయుచున్నది ఐనను పాఠ్య గ్రంథమును పరమ ప్రమాణముగా దీసికొని యందలి పాఠములన్నిటి నెట్లయినను ముగించి తీరవలెనని తొందరపడుట కూడదు పరీక్షలనే దృష్టియందుంచుకొనక సక్రమముగా బోధించ వీలయినన్ని పాఠములనే బోధించుట యెక్కువ ప్రయోజనకరముగా నుండును

## బాలురు చదువఁదగు విషయములు

నిత్య జీవనమందు బాలురు చూచుచుండునట్టివియు వారి కుపయోగముగా నుండునట్టివియు నగు విషయములకుఁ జెందిన పాఠములను, అట్టివానికే చెందిన సంభాషణములను బాలురు చదువఁదగియుందురు చెప్పఁదగిన పాఠములు నాటకరూపమున నున్ననవి బాలుర నాకర్షించును వారికి నాటకీకరణము విషయమునఁ గూడ నీపాఠములుపయోగముగా నుండును. ఈనాటకములు చిన్నచిన్న సన్నివేశములు గలవిగా

పరిషలయును. ఇవియన్నియు బాలురనుదినమును జూచు ప్రాణులకును బరిసరముల యందున్నవారు చేయు వృత్తులకును బరిశ్రమలకును సంబంధించినవిగాను జరిత్ర, పురాణములు మొదలగు వానియందలి యంశములను దెలియఁ జేయునవిగా నుండవలెను ఇవిగాక బాలుర యూహాశక్తిని వృద్ధిఁ జేయుటకుఁ దగిన కల్పనలతోఁ గూడిన పాఠములనుగూడ బాలురు నేర్చుకొనఁదగును. మనకుపయోగపడునట్టి కాగితము, పెన్సిలు మొదలగు సాధనములెట్లు సిద్ధము చేయఁబడుచున్నవో నేర్పుటకవి చెప్పినట్లుగా వ్రాయఁబడిన స్వీయ చరిత్రలు బాలుర కభిరుచిని గల్గించును కొన్ని యాత్రాస్థలములు మున్నగు వానిని వర్ణించుచు వ్రాయఁబడిన విషయములు కూడ బాలురు చదువఁదగినవియే ఇట్టివానిని జదువుటచేత బాలురకు వర్ణనావైదగ్ధ్య మేర్పడును ఇదివఱలోఁ జెప్పఁబడినట్టి పాఠ్య గ్రంథములలోని యంశములన్నియు బాలురు చదువఁదగియుండును.

పైఁ జెప్పఁబడినవేకాక బాలురు తమ తీరికసమయములను వ్యర్థముచేయకుండుటకై వినోదముకొఱకుఁ గొన్ని గ్రంథములను- బాఠ్యేతరములగువానిని- గూడఁ జదువవలెను ఇందులకై గ్రంథాలయము లందుఁగల సులభశైలిలో వ్రాయఁబడిన కథలపుస్తకములు, నవలలు, నాటకములు మొదలగునవి యుపయోగపడును. సచిత్రములగునవియు వినోదమును విజ్ఞానమును గల్గించునవియునగు మాసపత్రికలును(చందమామ, బాల మొదలగునవి) వారపత్రికలును (ఆంధ్రపత్రిక

మొదలగునవి), పక్షపత్రికలును, దినపత్రికలును- ముఖ్యముగా ననుబంధములతోఁ గూడిన యాదివారపుఁ బత్రికలు- వార్షిక సంచికలును బఠనీయములే.

---

## వ్యాకరణ బోధన

భాషయొక్క లక్షణమును నిరూపించు శాస్త్రమునకు వ్యాకరణ శాస్త్రమని పేరు భాషయందేది సాధువో యేది కాదో తెలిసికొనవలెనన్న నిది మిక్కిలి ప్రయోజనకారి

వ్యాకరణశాస్త్రమును బాలురకు బోధించుటవసరమా కాదా యను విషయమున భిన్నాభిప్రాయములు గలవు ప్రత్యక్ష పద్ధతి కనుకూలవాదులీ క్రింది విధమున వాదింతురు "వ్యాకరణము మూలమున భాషాస్వరూపము తెలియునుగాని ప్రయోగనైపుణ్య మేర్పడదు. రచననెక్కువగా నభ్యసించుట వలననే రచనానైపుణ్యమేర్పడును ఇతరకళలవలెనే రచనయు నిరంతరము రచనలను జేయుటవలన నేర్చుకొనినట్లు, రచన ఈ లక్షణములుగలదిగా నుండవలెననెడి సూత్రములను వల్లెవేయుట మూలమున నేర్చుకొనరాదు భాషయందలిగోపములు ప్రయోగవశమునను గ్రంథములు జదువుటమూలమున నుపాధ్యాయున్ని నాదర్శముగాఁ దీసికొనుట వలనను దొలఁగిపోయి నట్లు వ్యాకరణ సూత్రముల నప్పగించుటచేతఁ దొలఁగిపోవు. ఈ కర్తకే క్రియ యుండవలెను? కర్త క్రియలకు సామరస్య మున్నదా? యనుకొనుచు వ్యాకరణమునకు విరుద్ధముగా

పద్యము రచనఁ జేయువాఁడు గణములను లెక్కపెట్టుకొనుచు యతిప్రాసములను జూచుకొనుచుఁ బద్యరచనఁ జేయువానివలె సంధులను ఆరచన త్వరిగా ముగియదు కావున బాలురకుఁ జక్కని ప్రయోగాభ్యాసమును గల్గించవలెనేకాని వ్యాకరణము తోటికే పోరాదు వ్యాకరణమునుగూడ నేర్పినచోట విద్యార్థులు చేయు రచనలకన్న రచనను మాత్రమే నేర్పినచోట విద్యార్థులు చేయు రచన లెక్కువ సొంపుగానున్నవి" అని

పూర్వపు విద్యాబోధనా విధానమే యుక్తమైనదని బోధించువారు దీనికి వ్యతిరేకముగా నిల్చి వాదింతురు "వ్యాకరణమే భాషాస్వరూపమును నిరూపించును అది లేనిచో భాష యర్థమగుటగాని ప్రయోగము చేతనగుటగాని సాధ్యముకానివిషయము" అని

పై రెండు వాదములయందును గొంతగొంత సత్యము కలదు గొప్ప వ్యాకరణ శాస్త్రవేత్తలందఱును గొప్పకవులుగాఁ గాని, రచయితలుగాఁగాని పేరొందకపోవుటయు గొప్పకవులును రచయితలును గొంతవఱకైనను వ్యాకరణ జ్ఞానముగల వారగుటయు మనమెఱుఁగనిది కాదు. అందుచేత వ్యాకరణము నేర్చుకొననే భాష యలవడుననిగాని, భాష స్పష్టముగా నుండుటకు వ్యాకరణము నేర్చుకొనవలసిన పనిలేదనిగాని మన మంగీకరించము కాఁగా భాషాబోధనావసరమున వ్యాకరణమున కొక ప్రత్యేక స్థానము గలదని యేర్పడుచున్నది.

ఇఁక వ్యాకరణము నెపుడు బోధించవలెనో యేపద్ధతి ననుసరించి బోధించవలెనో తెలిసికొనవలెను బాలునిమనస్సు

వ్యాకరణమును గ్రహించుట కనువుగాలేని యతి బాల్య దశయందుఁ గాని యనుచిత పద్ధతుల మూలమునఁ గాని వ్యాకరణమును బోధించరాదు మనస్తత్వశాస్త్రము ననుసరించి పదునొకండు పండ్రెండేండ్ల లోపు బాలురకు వ్యాకరణమును సక్రమ పద్ధతిని బోధించరాదు అనఁగా మధ్యమ దశ నుండి మాత్రమే వ్యాకరణమును ప్రత్యేక పాఠ్యాంశముగ సక్రమ పద్ధతిని బోధించవలెను ఈలోపుగా బోధించినను బాలురకు గానియందభిరుచి యుండకపోవుటయు నది వారికి తలకెక్కక పోవుటయు నేర్పడును.

ప్రాథమిక దశయందలి బాలురకు శుద్ధమగు భాషననుకరించుట మూలమున నేర్చుకొనునట్లు శిక్షణ నీయవలెను ఇంటియందును, వీధియందును బాలురకలవడిన భాషా దోషముల నుపాధ్యాయుఁడు తనయాదర్శమును బురస్కరించుకొని సవరించవలెను వాచికచర్యా సందర్భములయందు సాధురూపములనే బాలురచేతఁ బలుమాఱుఁ బలికించవలెను ఆయా వ్యాకరణ విశేషములను దెలుపు సూత్రముల నొకవేళ బాలురు గ్రహించఁగల్గినను ప్రయోగించుపట్ల వాని నన్వయించుకొనలేరు. పాఠ్యపుస్తకములను జదువుటవలనఁగూడ బాలురకు సాధురూపములు తెలియును. అందుచేత నాయాతరగతులకుఁ జెందిన పుస్తకములను బాలురకిచ్చి వారిచేతఁ జదివించుచుండవలెను లిఖితరచనల సందర్భమునఁగూడ బాలురుచేయు దోషములను వారు గ్రహించు విధమున సవరించుచుండవలెను ఈ విధముగా నభ్యాసముల నిచ్చుట మూలమున బాలురయం

దుండిన యసాధు రూపములు పోయి సాధురూపము లల వడును. ఈవిధముగ వ్యాకరణమును వ్యవహారముమూలమున లేక ప్రయోగము మూలమున నేర్పుటకుఁ బ్రాయోగిక వ్యాకరణబోధ లేక క్రమేతర పద్ధతిని వ్యాకరణమును బోధించుట యందురు ప్రాథమిక దశయందు సక్రమపద్ధతిని వ్యాకరణమును ప్రత్యేక పాఠ్యాంశముగా బోధించుట వలనఁ బ్రయోజన ముండదని ప్రయోగముల మూలముననే గనుగొనఁబడినది

మధ్యమ దశయందు వ్యాకరణమును ప్రత్యేక పాఠ్యముగా బోధించఁదగును ఇందులకు రెండు పద్ధతులున్నవి. నిగమనోపపత్తిపద్ధతి యనునదొకటి బాలురకు ముందుగనే వ్యాకరణ సూత్రమును బోధించి తర్వాత దాని కుదాహరణములను వారి వాచకములనుండి తీసి చూపుటయే నిగమనోపపత్తిపద్ధతి యనఁబడును ఇది శాస్త్రీయము కాదు ఈవిధముగ నేర్చుకొనినవారు సూత్రములను వల్లెవేయుటకు సులభముగా నేర్తురుకాని వానియందలి పారిభాషిక పదములనుగాని వాని నన్వయించి ప్రయోగములను జేయుటనుగాని సులభముగా నేర్చుకొనలేరు అను మానోపపత్తిపద్ధతి యనున దింకొకటి— శాస్త్రీయమైన పద్ధతి— కలదు. దీనినే ప్రతిష్ఠాపన పద్ధతి యనియు నందురు ఏ వ్యాకరణ సూత్రమును బాలురకు బోధించవలెనో దాని కుదాహరణములను బాలుర పాఠ్యగ్రంథమునందలి వానినుపాధ్యాయుఁడు విద్యార్థుల యెదుట నుంచి యచ్చటి పూర్వరూపములను దరువాత జరిగిన మార్పులను వారు పరిశీలించునట్లు చేయవలెను అప్పుడచ్చట జరిగిన

వ్యాకరణ కార్యమును బాలురే చెప్పఁగలుగుదురు. పాణి చెప్పినట్లు సూత్రములలోఁ బారిభాషిక పదము లుండక పోవచ్చును గాని యభిప్రాయము సరిగనేయుండును పారిభాషిక పదముల నున్నత దశయందు నేర్పఁదగును బాలురే సూత్రనిర్మాణమును జేసిన పిదప దానికి మఱికొన్ని యుదాహరణములను బాల్య గ్రంథములనుండి గాని యితరచోట్లనుండి గాని చూపవలసినదిగా బాలురను గోరవచ్చును కాఁగా ననుమానోపపత్తి పద్ధతి ప్రకారము వ్యాకరణమును బోధించుటయు నిగమనోపపత్తిపద్ధతిననుసరించి దానిననువర్తింపఁ జేయుటయును జరుగవలెను బాలుఁడు సూత్రమును జెప్పినపిదప వివరించవలసిన వేవైన నున్నచో— అపవాదములు మొదలగువాని— నుపాధ్యాయుఁడే వివరించఁదగును.

ఈ దశయందు బాలుఁడు మఱొకటి రెండు భాషలను నేర్చుకోఁ బ్రారంభించును వానియందు నిట్లే వ్యాకరణ బోధ జరుగుచుండును. మాతృభాషాధ్యాపకుఁడు తాను బోధించు భాషయందలి వ్యాకరణ సంప్రదాయములకును దక్కిన వానికిని (బాలురు నేర్చుకొనుచున్న వానికి) బోలికలును భేదములునుగల చోట్లనెల్ల వానిని దెలియఁజేయుచుండవలెను దీనివలన విద్యార్థికి రెండు భాషలయందును మంచి ప్రవేశమేర్పడుటకు వీలుకలుగుచున్నది ఆయాభాషల వైలక్షణ్యము కూడ స్పష్టమగును

---

# లేఖనము (వ్రాత)

లేఖనము పఠనముకన్నఁ గష్టతరమైనది యగుటచేత మొదటఁ బఠనమునే నేర్చుకొనవలెనని యిదివరలోఁ దెలిసికొంటిమి. బాలుఁడు స్వతంత్రముగ నక్షరములను గుర్తించి చదువఁగల వెంటనే వానికి వ్రాతను నేర్పుటకుఁ బ్రారంభించవచ్చును. ఇప్పటికి బాలుని చేతి కండరములును లేఖనాసాధనమునకు బట్టువడి వ్రాయుటకుఁ దగిన శక్తిగలవి యగును. ఇట్టి శక్తినే వ్రాయుటకు సంసిద్ధత యందురు.

మొదటనే యక్షరములను వ్రాయుట సులభకార్యము గాదు. వ్రాతకుఁ బూర్వప్రయత్నముగాఁ గొన్ని గీతలను బలకమీఁదఁగాని, నల్లబల్లమీఁదఁగాని, విద్యార్థులచేత వ్రాయించఁదగును. ఈరేఖలెట్లుండవలె ననుట యాభాషయొక్క లిపి యాకారమునుబట్టి నిర్ణయించవలసి యుండును. ఆంధ్ర వర్ణసమామ్నాయమందు గుండ్రనియక్షరములే యధికముగాఁ గలవు. కావున మన బాలురకు గుండ్రని యాకారములతో నీయభ్యాసమును బ్రారంభించవలెను. సున్నలను వారు సరిగాఁ జుట్టుటకు నేర్చినతర్వాత నీ ఁ, ‿, ౦, ∩, ω, ന, ς, ౭ యాకారములను వ్రాయుటకుఁగూడ నేర్పవలెను ఇవి యన్నియు సరిగా వ్రాయఁగల్గిన వెంటనే పిల్లల కక్షరములను వ్రాయుట నేర్పవచ్చును.

ఇచ్చట గూడ వర్ణమాలలోనున్న యక్షరక్రమమున దిద్దఁబెట్టి వ్రాతను నేర్పరాదు బాలురు చదువుటలో నేర్చుకొనిన పదములను గ్రహించి యుపాధ్యాయుఁడు వానిని నల్ల

బల్లపై వ్రాసి బాలురు చూచి వ్రాయునట్లు చేయవచ్చును ఉపాధ్యాయుఁడు వ్రాయునపుడు చూచినచో బాలురట్లే చిత్ర లేఖనమునువలె వ్రాయఁగల్గుదురు. ఉపాధ్యాయుఁడైనను నిచ్చుట మొదలిడి యిట్లువ్రాసి యిచ్చుట ముగించవలెనని చెప్ప వచ్చును ఆవిధముగా నక్షరములను వ్రాయుటకు బాలురు నేర్చుకొనిన వెంటనే యుపాధ్యాయుఁడు తానుచ్చరించుచు (అవే పదములను) బాలురను వ్రాయవలసినదిగా హెచ్చరించ వలెను ఈవిధముగా నితరులు చెప్పుచుండఁగ విద్యార్థులు వ్రాయుట క్రమముగా సు స్తలేఖనమునకు దారితీయును పద ములను బాలురు సులువుగా వ్రాయఁగల్గిన తర్వాత నదేపద్ధ తిని వాక్యములను వ్రాయుటను వారికి నేర్పవలెను ఈవిధముగ నక్షరములను దిద్దుకొనకయే బాలుర వ్రాతను నేర్చుకొందురు. మూఁడవతరగతికి వచ్చుసరికి వారికక్షరములన్నియుఁబరిచితము లగును అప్పుడక్షరముల నకారాది క్రమమున బాలురచేత వ్రాయించుటయు నచ్చులయు హల్లులయుఁ జేరికయగు గుణింతమును గూడఁ గకారాది క్రమమునఁ జెప్పి చదివిం చుటయుఁ జేయఁదగును అప్పటి కన్నిధ్వనులయొక్క యక్షర రూపములను జదువుటయేకాక వ్రాయుటనుగూడ— వర్ణసమా మ్నాయక్రమమున బాలురు నేర్చుకొందురు బాలురు లేఖనా సాధనము ను బట్టుకొనుటలోను గూర్చుండుటలోను సరియగు పద్ధతులను వారికి నేర్పవలెను

అక్షరములన్యోన్యము పొందికగా నుండునట్లు బాలురు వ్రాయునట్లగాఁ జూడవలెను ఒకయక్షరము పెద్దదిగాను దాని

ప్రక్కనున్న యక్షరము చిన్నదిగాను వ్రాయకుండుటయు పంక్తులు చక్కగా నుండునట్లు వ్రాయుటయు నొకయక్షరమున కొకటి తగులకుండునట్లు వ్రాయుటయుఁ బదమునకుఁ బదమునకు మధ్యను గొంత చోటు విడుచుటయు వాక్యము ముగియఁగనే సంపూర్ణ విరామ చిహ్నము (Full Stop) నుంచుటయు బాలుఁడు మొదటనుండియు శ్రద్ధగా గమనించునట్లు చేయవలెను. మంచివ్రాతకు స్పష్టత, వేగము, నందము ననెడి మూఁడు లక్షణములుండును ఇందు స్పష్టతకు మిక్కిలిప్రాధాన్యము. ఇతరులు చదువవలెనన్న వ్రాత స్పష్టముగా నుండవలెనుగదా. ఇంతకుఁ గొంచెము ముందే చెప్పఁబడిన విధమున వ్రాసిన వ్రాత స్పష్టముగా నుండును స్పష్టముగా వ్రాయఁబడదేని యావ్రాత యెంత వేగముగా వ్రాయబడినను లాభము లేదు స్పష్టత బాగుగా నలవడిన పిదప వేగమునకుఁ బ్రాధాన్యమునిచ్చి యుక్తలేఖనములు, నియమిత కాలములోఁ జూచివ్రాతలు మొదలగు నభ్యాసముల మూలమున వేగ మలవడునట్లు చేయవచ్చును వేగముగావ్రాయలేనిచోఁ బరీక్షలలో మన యవస్థ యెట్లుండునో యాలోచింపుఁడు పైరెండు లక్షణములను గమనించుచు నందముగా వ్రాత యుండునట్లు చూచుకోవలసి యున్నది తెలుఁగు భాష నాంగ్లమువలె గొలుసు కత్తుగా వ్రాయక గుండ్రకత్తుగ వ్రాసినచో నందముగా నుండును.

# చూచి వ్రాత

స్పష్టతయు వేగము నందమును గల్గియుండియు వర్ణక్రమ దోషము లుండెనేని నది మంచివ్రాత యనరాదు. పలకలపైఁగాని కాగితములపైఁగాని గీతలను— జంటగాఁగాని, ఒంటిగాఁగాని— గీచి యందు మొదటి వరుసలో నుపాధ్యాయుఁడు చక్కఁగా వ్రాసి కడమ గీతలమీఁద బాలురను జూచి వ్రాయునట్లు చేయవచ్చును దీనివలనఁ బైని జెప్పఁబడిన మూఁడు లక్షణములు నలవడును గాని వర్ణక్రమ దోషములు బాగుగా సవరణ యగుటకు వీలులేదు ఒకే యక్షరమును బాలుడు పలుమారు వ్రాయుటయేకదా యిచటఁ జేయునది ఇదియొక విధమగు చూచివ్రాత. మరొక విధమగు చూచి వ్రాత కలదు బాలురు తాము చదివిన యేదేని పుస్తకమును జూచుచు దినమునకొక పరిచ్ఛేదమునో రెండిటనో పలకలపైగాని పుస్తకములపైఁగాని వ్రాయుదురు దీనివలన బాలురు చదివిన యంశములను జూచి మరల వ్రాయుట జరుగుచుండుటచేత వారి వర్ణక్రమము సరియగును వేగము గూడ యేర్పడును మూఁడవ తరగతి నుండియు విద్యార్థుల చేతఁ జూచి వ్రాత వ్రాయించుచుండ వలెను

మధ్యమ దశయందుఁ గూడ నిర్ణీత కాలమున నిర్ణీత భాగమును వ్రాయించుట మూలమున బాలుర లేఖనా వేగమును వృద్ధి చేయవచ్చును. ఈ దశయందుఁ బ్రారంభమున మాత్రము దీని ననుసరించినఁ జాలును.

# ఉక్త లేఖనము

ఇతరులు పుస్తకమును జూచుచుఁగాని చూడక గాని చెప్పుచున్న పదములనుగాని వాక్యములనుగాని వ్రాయుట ఉక్త లేఖన మనఁబడును. ఇందు బాలుఁడుచ్చారణమును శ్రద్ధతో వినవలసి యున్నది. ఆపదములయొక్కయు, వాక్యములయొక్కయు వర్ణక్రమము బాలునకుఁ దెలిసినదిగానుండవలెను. అందు చేత నుపాధ్యాయుఁడుక్తలేఖనమునఁ జెప్పువిషయము బాలురకందుబాటులో నుండవలయును. వారి కర్థముకానిదియు మిక్కిలి కఠినమగు వర్ణక్రమము గలదియు నగు నంశమును వ్రాయించుటవలన వారి మనస్సులకధికమగు ప్రయాస యేర్పడుట తప్ప మఱెట్టి ప్రయోజనము నుండదు. బాలురకు లాభము కలుగించెమును నిరుత్సాహ మధికమునగును.

ఉక్తలేఖనమునకుఁ దీసికొను విషయము బాలురకు సుబోధకముగా నుండవలెను. చెప్పుటకు ముందుపాధ్యాయుఁ డొక పర్యాయము దానిని దరగతికిఁ జదివి వినిపించవలెను ఉక్తలేఖనము వ్రాయు బాలురుపాధ్యాయుఁ డుచ్చరించినదానిని మఱల నుచ్చరించరాదు ఉపాధ్యాయుఁడుచెప్పు పదమునుగాని పద సముదాయమునుగాని పూర్తిగా విని తర్వాతనే బాలురు వ్రాయఁ బ్రారంభించవలెను ఉపాధ్యాయుని యుచ్చారణ ననుసరించి బాలురే విరామ చిహ్నముల నుంచవలెను గాని యుపాధ్యాయుఁడు వానినిగూడఁ జెప్పరాదు బాలురు వ్రా

యుటన్నైన పిదప నుపాధ్యాయుఁడు వారి వ్రాతలన్నిటిని జూచి వారికిఁ దప్పొప్పులను దెలియఁ జెప్పవలెను.

ఇది రెండవ తరగతియందే యుపాధ్యాయుడు చెప్పు పదములను బాలురు వ్రాయుటతోఁ బ్రారంభమై మధ్యమదశ వఱకును వ్యాప్తిఁజెందును. ఇందులకు విషయములు బాలుర పాఠ్య గ్రంథములయందు వారికయిన పాఠములనుండి గాని యట్టివే సులభములగు నితర గ్రంథములనుండి గాని పత్రికలు మొదలగు వానినుండిగాని తీసికొనఁ దగును.

## లిఖిత రచన

బాలురు చిన్నచిన్న వాక్యముల నుక్తరచనఁ జేయఁగల శక్తి వచ్చిన తర్వాత లిఖిత రచనను బ్రారంభించవచ్చును. వాచికచర్యాసందర్భమున బాలురకుఁ బరిచితములైన విషయములను గూర్చి వారిచేత నెట్లు మాటలాడించవలెనో—బాలుఁడు బడికి వచ్చినప్పటి నుండియే—యిదివఱలోఁ జెప్పఁబడినది. ఆవిధముగాఁ దమ మనస్సులందలి యభిప్రాయములను సరియగు వాక్యములుగా నుక్తరచనఁ జేయుట నేర్పిన తర్వాత లిఖితరచనను బ్రారంభించఁదగును. బాలుఁడెదుట నున్నవారికిఁ దన యభిప్రాయముల నెఱిఁగించుటకు ఉక్తరచన సరిపడునుగాని దూరమున నున్నవారికిఁ దెలియఁ జేయవలెనన్న లిఖితరచన యవసర మగునుగదా.

ప్రాథమిక దశయందు మూఁడవ తరగతి నుండియే లిఖిత రచనను బ్రారంభించఁదగును. ఇప్పట్టున బాలుఁడు

తాను గోరుకొనిన యంశమును గుఱించియే కొలఁది వాక్యములు వ్రాయఁగల్గినఁ జాలును. క్రీడామార్గము ననుసరించియే బోధన సాగించవలెను.

నాల్గవ తరగతి నుండియు బాలుర ప్రత్యేక విషయములపై లిఖిత రచనఁజేయుటకభ్యాసము నీయవలసియుండును ఏతరగతి యందైనను లిఖిత రచనాభ్యాసము నిచ్చుటకుఁ బూర్వమా విషయముఁ గూర్చి బాలురతో సంభాషించుట మూలమునను సంవాదముఁ జేయుట మూలమునను వారి నందులకు సిద్ధము చేయవలెను ముఖ్యముగా మూఁడు నాలుగైదు తరగతులలో నియ్యది యవసరము. రచనా సామగ్రిని బాలురు ముందుగనే సమకూర్చుకొనవలసి యుండును. అందుకై వారు గ్రంథాలయమునందున్న తత్సంబంధములగు పుస్తకములను జదువుటయు, సందేహము లేనైన నున్న నుపాధ్యాయుఁడు మొదలగు వారి సహాయమున వానిని దీర్చుకొని యుండుటయు నవసరము.

నేఁడు పాఠశాలలలోఁ జేయఁబడురచనలు చాలవఱకు రసవంతముగా లేకపోవుటకనేక కారణములు గలవు ఉపాధ్యాయుఁడే రచనాంశమును నిర్ణయించుటచేత బాలురకు దానియందుత్సాహము లోపించును. తాను జేయు రచన నెవ్వరును జదువువారు లేరని విద్యార్థికిఁ దెలియును. అనేక పుస్తకములను దిద్దవలసినట్టి యుపాధ్యాయుఁ డందఱి రచనలను జక్కగాఁ జూచుటకు వీలుండదు

ఈ లోపములు లేకుండఁ జేసినచో రచన చాలవఱకుఁ

జిక్కఁబడును బాలుర కందఱికి నొకే విషయముపై నభిరుచి యుండదు. కొందఱొక పండుగ దినమును గూర్చి వ్రాయవలె నందురు, కొందఱు వాన దినమునుగూర్చి తమ యభిప్రాయ ములు తెలియఁజేయఁ జూతురు, కొందఱెచ్చటనో చూచినట్టి చిత్రవస్తు ప్రదర్శనశాలనుగూర్చి వ్రాయవలెనని యువ్విళ్లూరు చుందురు, కొందఱు తాము జూచిన "సర్కసు" ను గూర్చి రచించఁజూతురు, కొందఱు పడవ ప్రయాణమును వర్ణించ నెంతురు. ఇట్లే యెవ్వరికేయే యనుభవములు గలవో యేయే విషయములపై నభిరుచి గలదో యాయా విషయములను గూర్చి రచనఁ జేయవలెనందురు అందుచేత నుపాధ్యాయుఁడు విద్యార్థులు కోరుకొనునట్టివియు వారికిఁ బరిచితములగునట్టి వియు నైన విషయములను గూర్చి మొదట వారితో విపుల ముగా సంభాషించవలెను తర్వాత నందే బాలుఁడే యంశ మును గూర్చి వ్రాయనెంచునో యతఁడా విషయమునుగూర్చి రచించ వలసినదిగాఁ గోరవచ్చును.

ఈ విధముగాఁ దమ యిష్టమువచ్చిన విషయములపై వాక్యరచనలను జిన్న చిన్న వ్యాసరచనలను జేయుటకు నేర్చుకొనిన తర్వాత వారు చదివిన పాఠ్యగ్రంథములనుండి—ఇవి మాతృభాషేతరములగునవి కూడఁగా వచ్చును—తగిన యంశములను దీసికొని వ్యాసరచనఁ జేయించవచ్చును. అవి బాలుర యనుభవములకుఁ జెందినవి కాకపోయినను దరగతియందు బోధించఁబడినవైనందున బాలుర రచన సాగించుట కనువుగనే యుండును. ఇట్టి రచనలను గొన్నిటిని జేయించిన తర్వాత నూహాజనకములగు వ్యాసములను వ్రాయించఁదగును. "పెద్దవాడవైన పిదప నీవే వృత్తి నవలంబించఁ గోరుదువు?", "నీవు రైలు ప్రమాదమునందుఁ దప్పించుకొన్నట్లూహించి

నీ గమనానమములను గూర్చి వ్రాయుము." "ఏదేని ఎన్నికలలో నీవొక యభ్యర్థిగా నున్నట్లు భావించి యప్పటి నీయవస్థను వ్రాయుము" అనునట్టివి బాలురూహించి వ్రాయఁగల వానిని కొన్నిటిని వారియెదుటనుంచి యెవరి కిష్టము వచ్చిన వానిఁ గూర్చి వారు వ్రాయవలసినట్లు చెప్పఁదగును. ఇటివి కొన్ని శైశవస్మృతు బాలుర మాచియుండిన మంచి దృశ్యములను గూర్చియు వర్ణనా యుక్తములగు రచనలను వాదనల కెడమిచ్చు రచనలను గూడ వ్రాయించఁదగును. ఇవి మాధ్యమదశయందుఁ జేయించఁ దగినవి.

## బాలురచేత రచనను జేయించవలసిన విధము

బాలురు తమకుఁదాముగాఁ గాని యుపాధ్యాయుఁడే వారి యభిరుచులకుఁ దగినట్లుగాని విషయమును నిర్ణయించుట యైన యనంతరము బాలురా రచనకవసరమగు సామగ్రిని సేకరించవలెను. ఈవిధముగ వారు ప్రయత్నించునపుడు గ్రంథాలయమందలి గ్రంథములఁ జూడవచ్చును ఉపాధ్యాయునిగూడఁ గొన్ని ప్రశ్నలడుగవచ్చును. అట్లు వారు సమకూర్చుకొనిన యంశములను సూచనలవలె వ్రాసి యుంచుకొనఁదగును. ఈకృషికై యొకటి రెండు గంటల కాలము పట్టవచ్చును. ఇది ప్రయత్నము

తర్వాత వారు వ్రాసి యుంచుకొనిన సూచనలననుసరించి వ్యాసమును వ్రాయవలెను ఇట్లు వ్రాయునపుడు వాక్యములు నిర్దుష్టముగను రచన చక్కగ నుండునంతవఱకుఁ బదములను గాని వాక్యములనేగాని కొట్టివేసి వ్రాయవలయును. ఇట్టి యవకాశమును బాలురకిచ్చినపుడే వారి రచనలు చదువఁదగియుండును లేనిచోఁ బెద్దలరచనలుకూడ నింపుగానుండవు.

ఇది చిత్తు వ్రాయుట

చిత్తు ప్రతిని వ్రాయుట యైనపిదప దానినిజూచి శుద్ధ ప్రతిని వ్రాయవలెను దీనిని వ్రాయునపుడుఁ గూడఁ దోఁచిన మార్పులను జేయవచ్చును

వ్యాసరచనా సందర్భమున బాలురు తమ వ్యాసముల యందొక్కొక ప్రధానాంశమునకు సంబంధించిన వాక్యముల నన్నిటి నొకే పరిచ్ఛేదముగా వ్రాయవలసి యుండును వర్ణ క్రమము దోషరహితముగా నుండవలెనని వేరుగాఁ జెప్పఁబని లేదు. సంపూర్ణ విరామ చిహ్నములను మొదటినుండియు బాలు రుపయోగించునట్లు చూడవలెను. ఆశ్చర్యార్థక చిహ్నములుఁ బ్రశ్నార్థక చిహ్నములుఁ గించి ద్విరామ చిహ్నములుఁ (*Commas*) గ్రమముగా నుపయోగించఁ గల్గునట్లు చూడవలెను జాతీయములను బ్రయోగించుట యందును వారికి నేర్పు గల్గించవలెను లోకోక్తులు రచనకు సౌందర్యము నిచ్చును. కొన్నికొన్ని తగిన సందర్భములయందు తెలుఁగు భాషా లక్షణములలో నొకటియగు సమాసములనువాడుటను మధ్యమ దశయందు నేర్పఁదగును

ఇంత శ్రమపడి వ్యాసమును వ్రాసినతర్వాత దానినిఁ జదువువారున్నచో బాలురకు మఱింత యుత్సాహముగల్గును. అందుచేత నుత్తమ రచనలుగా నుండువాని నుపాధ్యాయుఁడు తరగతియందుఁ జదివించవచ్చును కడమ బాలురచేతను ఉపాధ్యాయుని చేతను బొందు మన్ననలు బాలురకు మిక్కిలి ప్రోత్సాహము నిచ్చును బాలురే యొకరిరచనల నొకరు

చదువునట్లు చేయవచ్చును వారినింట్లయొద్దఁ దమతమ తల్లి దండ్రులకుఁ దమతమరచనలను జదివి వినిపించునట్లు చేయవచ్చును

ప్రాథమిక దశయందుఁ జిత్రపట వర్ణనమును గూడఁ జేయించఁదగును. బాలురచేతఁ జిత్రములను బరిశీలింపఁ జేసి వానినిగూర్చి కొన్ని ప్రశ్నలనిచ్చి సమాధానములను వ్రాయించవచ్చును కొన్ని ముఖ్యములైన పదములనిచ్చి వాని నుపయోగించి బాలురు చిత్రపటమును వర్ణించునట్లుఁ జేయవచ్చును కొన్ని వాక్యములను బదలోపములతో నిచ్చి లోపించిన భాగములను బటము సహాయమునఁ బూర్తి చేయించవచ్చును

ప్రాథమికదశ ముగియుసరికి బాలురు నూటయేబది పదములుగల వ్యాసములను మధ్యమదశ ముగియుసరికి మూఁడువందల పదములుగల వ్యాసములను వ్రాయఁగలిగి యుండవలెను.

## లేఖారచన

నాల్గవ తరగతియందు లేఖారచనమును బ్రారంభించఁ దగును లేఖ నెట్లు ప్రారంభించవలసినదియు, నెట్లువిషయమును వ్రాయవలసినదియు నెట్లు ముగించవలసినదియు బాలురకుఁ దెలిసియుండఁదగును. లేఖలయం దుపయోగించు భాష సామాన్య వ్యవహారభాషగా నుండఁదగును ఎదుటి వారితో నెట్టి శైలియందు సంభాషణఁ జేయుదుమో యట్టి శైలినే లేఖలయం దుపయోగించవలెను. మనము విషయమును దెలియఁజేయవలసిన వ్యక్తియెదుట లేకపోవుటచేత లేఖమూల

మున వానికా విషయమును దెలియఁజేయవలసిన యవసర మేర్పడినదనియుఁ బాండిత్యమును బ్రకటించుటకుఁ గాదనియు నెఱుఁగవలెను. దూరముగనున్న బంధువులకుఁ గొన్ని విషయములను దెలియఁజేయుటకో వారినుండి కొన్ని సంగతులను దెలిసికొనుటకో మఱొకచోటినుండి పుస్తకములు, వస్తువులు మొదలగువానిని దెప్పించుకొనుటకో యేదేని సమావేశముచ కెవరినైనను బెద్దల నాహ్వానించుటకో మనము లేఖలను వ్రాయుట యవసరమగును అందుచేత లేఖరచనాభ్యాసమును బాలురకుఁ గల్గించుట యుక్తము.

నాల్గవ తరగతియందు బంధువులకువ్రాయు సామాన్య లేఖలను నేర్పఁదగును. ఉపాధ్యాయునకు వ్రాయు సెలవుజాబులను గూడ నేర్పవచ్చును ఐదవ తరగతియందు వ్యాపార లేఖలను, సాంఘిక లేఖలను వ్రాయుట నలవాటు చేయఁదగును

మాధ్యమిక దశయందు వానినే విపులముగా వ్రాయించుటకుఁ దోడు పై యధికారులకు వ్రాయు మనవులను నేర్పఁదగును. బంధువులకు వ్రాయు లేఖలందలి శైలికన్న సారస్వత సంఘముల కాహ్వానములుగా వ్రాయులేఖలందలి శైలి కొంత ప్రౌఢముగా నుండఁదగును. అట్లే మనము వ్రాయువాఁడు సామాన్య విద్యావంతుఁడైనప్పుడు వ్రాయు శైలికిని యధిక విద్యాసంపన్నుఁడైనప్పుడు వ్రాయు శైలికని భేదముండవలెను. ఇట్టి భేదములను బాలురు గమనించునట్లు చేయవలెను.

## కల్పనా ప్రకటన

బాలురయందుఁ గల్పనాశక్తి నభివృద్ధి చేయవలసియున్నది. అందులకుఁ గథారచనలతోఁ బ్రారంభముచేయ

వచ్చును. బాలురు చదువునట్టి పాఠ్యగ్రంథములయందు నితర గ్రంథములయందును బత్రికలయందును మంచి కల్పనలతోఁ గూడిన కథలుండును. వానిని బాలురు చక్కఁగా గ్రహించి వ్యాసరూపమున వెల్లడించునట్లుగా నుపాధ్యాయుఁడు వారిని ప్రాథమిక దశనుండియే ప్రోత్సహించవచ్చును.

పై విధమునఁ జదివిన కల్పనలను బ్రకటించఁగల శక్తి వచ్చిన పిదప బాలుర నూహించిన విషయములను గూర్చి వ్యాసరచనఁ జేయవలసినట్లు పురికొల్పవచ్చును. అట్లు వారూహించఁబడిన విషయము లింతకుముందు పాఠములలోఁ జెప్పఁబడినవి. కథలుగానున్న విషయములను బాలురు నాటక రూపమున మార్చి వ్రాయుటకును నేర్పవలయును. ఈవిధముగాఁ జేయుటవలనఁ బరోక్షముగా జెప్పబడిన విషయములను బ్రత్యక్షముగాఁ జెప్పఁగల సమర్థత బాలురకలవడును. ప్రాథమిక దశయందు ఏకాంకికలగు చిన్న నాటకములను మధ్యమదశయందు బంచాంకవ్యయముగల వానిని వ్రాయించఁవలెను. ఆవిధముగా బాలురు రచించిన వానిలో నుత్తమములగువానిని నాటకీకరణ సందర్భమున నుపయోగించఁదగును. స్వతంత్ర రచనా శక్తి బాలురలో నలవడుటకిట్టి యభ్యాసములు దోహదమును గలిగించును.

---

# లిఖిత రచనయందలి దోషముల సవరించుట



రచనలను జేయించు సందర్భములయం దుపాధ్యాయుఁడెల్ల వేళల యందును బాలురను బ్రోత్సాహపఱచుచుండవలెను నిరుత్సాహకరములగు మాటల నెప్పుడు నుపాధ్యాయుఁ డనరాదు విద్యార్థులాఱితేఱిన రచయితలుగారు రచన యనునది సులభ కార్యమునుగాదు, అందుచేత బాలురు చేయు రచనలలో నేవేనిదోషములుండకపోవు వానినుపాధ్యాయుఁడు సవరించవలెను

ఇదివఱలోఁ జెప్పఁబడిన యుచ్చారణా దోషములు వ్యాసరచనా సందర్భమున వర్ణక్రమ దోషములుగాఁ బరిణమించును వానినన్నిటిని జాగ్రత్తగా నుపాధ్యాయుఁడు గుర్తించి యాదోషములను బాలురెల్లరు గమనించునట్లును నట్టి దోషములను దర్వాత నెప్పుడును జేయకుండునట్లును జూడవలెను పొరపాటున నుపాధ్యాయుఁడొక్క దోషమును విడిచినను బాలుఁడది సరియేయని భ్రమపడును అట్లు వారి కవి యలవాటైనచో నెంత ప్రయత్నించినను దరువాత చక్కఁబడుట యసాధ్యము

ఇవిగాక భావసంబంధమైన దోషము లేర్పడి యుండవచ్చును సరియైనవైనను భావములను బ్రకటించుపట్లు దోషములు— వ్యాకరణ సంబంధమైనవి కాని భాషాసంబంధ

మైనవికాని— కొన్ని యేర్పడవచ్చును ఏసందర్భమున నేపదమును ప్రయోగించవలసినదియుఁ దెలియక పోవచ్చును ఒక పదమున కింకొక పదమును బొరపడి యుండవచ్చును ఇట్టిదోషముల నుపాధ్యాయుఁడు సరిగా గమనించి బాలురకుఁ దెలియఁ జేయవలెను. ఒక్కొక్క కరికము దోషమునకు సూచనగానొక్కొక యక్షరము నేర్పాటు చేసికొని యాయక్షరముచేత నా దోషమును సూచించఁదగును ఒకటి రెండుసార్లు వివరించినతర్వాత బాలురు వానిని దెలిసికొనఁగల్గుదురు బాలురు సామాన్యముగాఁ జేయు దోషముల నొక పుస్తకములో (*A book of Common errors*) గుర్తుంచుకొని వాని సాధు రూపముల బాలురకుఁ జెప్పవలెను.

ఈ విధముగాఁ దప్పులను దిద్దుటమైనతర్వాత వానిని గమనించుచు బాలుర మఱల వ్యాసము శుద్ధముగ వ్రాసికొనునట్లు చేయవలెను ఇట్లు చేయుటచేత రచనాదోషములు క్రమముగఁ దొలఁగిపోవును.



# కొన్ని పాఠములకుఁ బాఠక్రమ సూచికలు వ్రాయుట



1) పురుషుండు రెండు తెఱఁగుల
ధరనుత్తముఁడనఁగఁ బరఁగుఁ దానెవ్వాఁడనన్
బరుసములు పలుకకునికిన్
దురితంబులు వారయు పనులు దొఱఁగుట కతనన్.

(2) పూర్వకాలమున సత్రాజిత్తను నొక రాజుండెను. అతఁడు చాలకాలము ఆదిత్యు నారాధించి తదను గ్రహమున శమంతకమణియను నొక దివ్యరత్నమును బడసెను. ఆరత్నము దినమునకు పదిబారువుల బంగారము నిచ్చుచుండెను. మఱియు నా రత్నరాజ మే దేశమున నుండునో ఆ దేశము సుభిక్షముగ విరాజిల్లును. ఆ రత్న ప్రభావముచే సత్రాజిత్తు మహాధనవంతుఁడై చక్కఁగ రాజ్యపాలన మొనర్చుచుండెను.

ఒకానొక దినమున సత్రాజిత్తు శమంతక మణిని కంఠమున ధరించి శ్రీకృష్ణ దర్శనార్థియై ద్వారక కేగెను. నగరవాసులెల్లరు నతనినిగాంచి ఆదిత్యుఁడని తలఁచిరి.

(3) కర్త, కర్మ, క్రియలు.

# (1) పద్యపాఠక్రమ సూచిక

ఉపాధ్యాయుని పేరు............ ...... బోధించు తరగతి ...

తేది....... ..                    కాలము: 30 నిమిషములు.

పాఠము. తెలుఁగుపద్యము. అంశము పురుషుఁడు ..కతనన్

లక్ష్యము (1) పద్యభావమును బాలురుగ్రహించునట్లుచేయుట

(2) తెఱఁగు, ధర, పరఁగు, పరుసము, దురితము, పేరయు, తొలఁగుట — అను పదములకు అర్థముల నేర్పుట

(3) పద్యమందలి సొంపును బాలురు గ్రహించునట్లు చేసి, వారికి సారస్వతము నందభిలాషను గలిగించుట.

ఉపకరణములు:—

| విషయము | పద్ధతి |
|---|---|
| (1) ప్రారంభము — | |
| వారివారిగుణములను బట్టి లోకములోనిజనులను రెండు విధములుగా విభజించవచ్చును మంచివారు చెడ్డవారు నిజముఁజెప్పుట జీవహింస చేయకుండుట | గుణములనుబట్టి లోకములోని జనులనెన్ని విధములుగా విభజించవచ్చును? |
| | ఎట్లు? |
| | కొన్ని మంచి గుణములను జెప్పుము. |

| విషయము | పద్ధతి |
| --- | --- |
| మొదలగునవి మంచి గుణములు. మనము మంచి వారి మనిపించుకొనుటకే ప్రయత్నించవలెను | మనము ఎట్టివార మనిపించుకొనుటకుఁ బ్రయత్నించవలెను? |

(2) శీర్షికా ప్రకటనము — మంచివాఁడనిపించుకొనుట కవలంబించఁదగు "రెండు పద్ధతు" (B B S) లను గూర్చి యిపుడు తెలిసికొందము

| | |
| --- | --- |
| (3) ప్రదర్శనము — | పద్యమును పద్యముఁ జదువవలసినట్లొకసారియు అర్థము బాలురకుఁ జక్కఁగాఁ దోఁచునట్లొకసారియుఁ జదువవలెను |
| తెఱఁగు = విధము (BBS) | లోకమందు ప్రజలు మంచివారనియు, చెడ్డవారనియు రెండు తెఱఁగులుగా నున్నారు |
| | "తెఱఁగు" అనఁగా నర్థమేమి? |
| ధర = భూమి (BBS) | మంచిపనులు చేసినవారి పేరు ఈ ధరయందంతటను శాశ్వతముగా నుండును |
| | 'ధర' యనఁగా నేమి? |
| పరఁగును = ప్రకాశించును (BBS) | మన దేశము హిందూ దేశము, |

| విషయము | పద్ధతి |
|---|---|
| | భరతఖండము, భారత వర్షము అను పేర్లతోఁ బరఁగుచున్నది |
| మానవుఁడు రెండు విధములుగా నుత్తముఁడని పించుకొనవచ్చును | 'పరఁగును' అన నేమి? |
| | మానవుఁడు ఉత్తముఁడనిపించుకొనవలెనా? అధముఁ డనిపించుకొనవలెనా? |
| | ఎన్ని విధములుగా నట్లనిపించుకొన వచ్చును? |
| పరుసము = కఠినపుమాట. (BBS) | సజ్జనులు ఎంత నెమ్మదిగా మాటలాడుచున్నను దుర్జనులు పరుషములే పలుకుదురు |
| ఏ ప్రదేశము నందైనను కఠినపు మాటలను బలుకకుండుట ఉత్తముఁ డనిపించుకొనుటకు ఒక పద్ధతి | 'పరుసములు' అన నేమి? |
| | కఠినపు మాటలు పలుకు వారి నేమందురు? |
| | ఉత్తముఁ డనిపించుకొనఁ దలఁచినవాఁ డెట్టి మాటలను బలుకరాదు? |
| దురితము వొరయును = పాపమువచ్చును (BBS) | నిజము పలుకుటవలనఁ బుణ్యము వచ్చును అబద్ధముఁ జెప్పుటచే దురితము వొరయును. |
| | 'దురితము వొరయును' అన నేమి? |

| విషయము | పద్ధతి |
|---|---|
| **తొఱఁగుట – విడిచిపెట్టుట** (BBS) | కల్లు త్రాగినవారు సిగ్గు **దొఱఁగి** మాటలాడుచుందురు 'తొఱఁగుట' అననేమి? |
| దొంగతనము చేయుట మొదలగునవి పాపపుఁబనులు పాపములు వచ్చు పనులను విడిచి పెట్టుట ఉత్తముఁ డనిపించుకొనుటకు రెండవ పద్ధతి | పాపములు వచ్చు పనులేవి? ఉత్తముఁ డనిపించుకొనఁ దలఁచిన వాఁడు అట్టి పనులను జేయ వచ్చునా? కూడదా? ఉత్తముఁ డనిపించుకొనుటకు రెండవ పద్ధతియేది? ఇట్టి నీతులు భారతమందు చాల గలవని చెప్పవలెను. |
| (1) సింహావలోకనము | మనుష్యుఁ డెన్ని విధములుగా నుత్తముఁ డని పించుకొన వచ్చును? అందు మొదటి విధమేది? రెండవ విధమేది? (సమాధానములను నల్ల బల్లపై వ్రాయవలెను) పద్యమును జదివి బాలురచేతఁ జదివించవలెను. (దీనిని విద్యార్థులు చూచి వ్రాసికొనవలెను) |

(5) నల్లబల్ల సారాంశము

తెలుఁగు — విధము.

ధర — భూమి

పరఁగును — ప్రకాశించును.

పగుసము — కఠినపుమాట

దురితము పొరయును — పాపమువచ్చును.

తొలఁగుట — విడిచిపెట్టుట

రెండు పద్ధతులు

మనుష్యుఁడు రెండు విధములుగా ఉత్తముఁడనిపించుకొన వచ్చును. ఎచ్చటను కఠినముగా మాటలాడకుండుట ఒక పద్ధతి పాపమువచ్చు పనులను జేయకుండుట రెండవ పద్ధతి.

## గద్య పాఠక్రమ సూచిక

ఉపాధ్యాయుని పేరు ... ....... .. ....బోధించుతరగతి 5వ.

తేది . . .. . . .  కాలము 40 నిముసములు

పాఠము తెలుఁగు గద్యము అంశము సత్రాజిత్తుద్వారకకుఁ బోవుట

లక్ష్యము (1) గద్యభావమును బాలురుగ్రహించునట్లు చేయుట

(2) ఆదిత్యుఁడు, ఆరాధించుట, తదనుగ్రహము, రాజము, సుభిక్షము, విరాజిల్లుట, దర్శనార్థి— అను పదముల కర్థములను నేర్పుట.

(3) ఆరాధించుట, రాజము— అను పదములను ప్రయోగించునట్లు శిక్షణనిచ్చుట

ఉపకరణములు — రత్నములు చిత్రించఁబడిన పటము.

| విషయము | పద్ధతి |
|---|---|
| (1) ప్రారంభము స్త్రీలు సొమ్ములను ధరింతురు బంగారు నగల యందు రత్నములను పొదుగుదురు. ఆ రత్నములు మెఱయు చుండును రాజులు అట్టి వెలగల రత్నముల నెక్కువగా కలిగియుందురు. | సొమ్ములెవరు ధరింతురు? బంగారు నగలలో వేనిని పొదుగుదురు? ఏల? అట్టి వెలగల రత్నముల నెవరెక్కువగా కలిగి యుందురు? |

(2) శీర్షికా ప్రకటనము:- పూర్వము సత్రాజిత్తను నొక రాజు గొప్ప రత్నము నొకదానిని ధరించి శ్రీకృష్ణునిఁ జూడఁబోయెను. దానినిగూర్చి యిప్పుడు తెలిసికొందము
"సత్రాజిత్తు ద్వారకకుఁ బోవుట" (BB)

| | |
|---|---|
| (3) ప్రదర్శనము— | వచన భాగము నుపాధ్యాయుఁ డొకసారి చక్కఁగాఁ జదివి కొందఱు బాలురచేతఁ జదివించవలెను (మధ్యమ దశయందైనచో నొకరిద్దరు బాలురచేఁ జదివించి రెండు మూఁడు నిమిషములు మౌన పఠనము చేయించవలెను) |
| సత్రాజిత్తు శమంతక మణిని ధరించి ద్వారకకుఁ | మన పాఠములో వచ్చుమణి ఏది? |

| విషయము | పద్ధతి |
|---|---|
| బోయెను. ద్వారకలో శ్రీ కృష్ణుఁడుండెను. | సత్రాజిత్తు దానినిధరించియెచటికిఁ బోయెను?<br>అపుడు ద్వారకలో నెవరుండిరి. |
| సత్రాజిత్తు ఒకరాజు (BB)<br>అతఁడు మునుపటివాఁడు?<br>ఆదిత్యుఁడు = సూర్యుఁడు (BB) | సత్రాజిత్తు ఎవరు?<br>అతఁడేకాలమునాటి వాఁడు?<br>చంద్రుఁడు వెలుతురునుమాత్రమే యిచ్చునుగాని ఆదిత్యుఁడు వేడిమిని గూడ నిచ్చును.<br>'ఆదిత్యుఁ' డన నెవరు? |
| ఆరాధించుట = పూజించుట (BB) | పుణ్య దినములయందు ప్రజలు దేవునారాధించుటకై దేవాలయమునకుఁ బోదురు.<br>"ఆరాధించుట" యన నేమి?<br>హిందువులు రాముని, కృష్ణునిఁ బూజించినట్లే క్రైస్తవులు ఏసుక్రీస్తును, ముస్లిములు అల్లాను బూజింతురు పై సందర్భమున బాలురచేత 'ఆరాధించుట' యను పదమున ప్రయోగింపఁ జేయవలెను |
| సత్రాజిత్తు సూర్యునిఁజాల కాలము పూజించెను. | సత్రాజిత్తు పూజించిన దెవరిని?<br>సావిత్రి యమునిఁ బ్రార్థించి |

| విషయము | పద్ధతి |
| --- | --- |
| తదనుగ్రహము—వానిదయ (BB) | తదనుగ్రహమున భర్తను బ్రదికించుకొనెను. |
| అతఁడు సూర్యునిదయచే శ్యమంతకమణిని బొందెను (BB) | 'తదనుగ్రహ' మన నేమి? సూర్యునిదయచే సత్రాజిత్తు దేనిని బొందెను' |
| అది శ్రేష్ఠమైన రత్నము. అది దినమునకు పది బారువుల బంగారము నిచ్చును. బారువు ఇరువది మణుగులు | ఆరత్న మెట్టిది? (ఇచ్చట రత్నములు చిత్రించఁబడిన పటమును జూపి రత్నము లిట్లుండు నని చెప్పవలెను) అది దినమునకెంత బంగారము నిచ్చును? బారువనగనెంత తూఁకముండును? |
| రాజము = శ్రేష్ఠమైనది. (BB) | మనభాషలో పెద్ద గ్రంథములు చాల గలవు వానియందు భారత రామాయణ భాగవతములు (గ్రంథ) రాజములు. 'రాజ' మనఁగా నేమి? వెలగల రత్నము లిపుడును జాల గలవు వానిలో కోహినూరు శ్రేష్ఠమగు రత్నము. పై సందర్భమున బాలుర చేత |

| వి ష య ము | ప ద్ధ తి |
|---|---|
| | 'రాజము' అనుపదమును ప్రయోగింపఁ జేయవలెను. |
| సుభిక్షము = కఱవు లేక పోవుట. (BB) | శ్రీ రాముఁడు రాజ్యమును బాలించునపుడు దేశములో కఱవు లేదు. సుభిక్షముగా నుండెను. 'సుభిక్ష' మన నేమి? |
| విరాజిల్లుట = ప్రకాశించుట. (BB) | బుడ్డిదీపములు కొద్దిగా వెలుతురు నిచ్చును. విద్యుద్దీపములు పెద్ద కాంతితో విరాజిల్లును. 'విరాజిల్లుట' యన నేమి? |
| శమంతక రత్నముండు దేశములోఁ బంటలు చక్కగాఁ బండును. | శమంతకరత్నముండు దేశములోఁ బంటలెట్లుండును? |
| ఆ రత్నముచే సత్రాజిత్తు గొప్ప ధనవంతుఁడయ్యెను. | దినమునకు పదిబారువ్రల బంగారము దొఱకుటచే సత్రాజిత్తు కొలదికాలములో నెట్టివాఁడగును? |
| అతఁడు రాజ్యమును చక్కగాబాలించుచుండెను | అతఁడెట్లు రాజ్యమునుబాలించుచుండెను? |
| దర్శనము = చూచుట. | ముక్కోటినాఁడు దేవునిజూచుటకై యాలయమునకు వెళ్లితిని. కాని జనులెక్కువగా నుండుటచే దేవుని |

| విషయము | పద్ధతి |
| --- | --- |
| | దర్శనము సరిగా కాలేదు |
| | 'దర్శన' మనఁగా నేమి? |
| దర్శన + అర్థి- చూడఁ గోరినవాఁడు $(BB)$ | విద్యను గోరినవానిని విద్యార్థి (విద్య+అర్థి) యందురు దర్శనార్థి యనఁగా నేమి? |
| అతఁడు శ్రీకృష్ణుని జూడఁ బోయెను $(BB)$ | సత్రాజిత్తు ఎవరిని జూడఁబోయెను? |
| శ్రీకృష్ణుడు ద్వారకలో నుండెను | శ్రీకృష్ణుఁ డెచ్చట నుండెను? |
| సత్రాజిత్తు ద్వారకకుఁ బోయెను. | సత్రాజిత్తు కృష్ణునిఁ జూచుట కెచటికిఁ బోయెను? |
| అతఁడపుడు శమంతక మణిని మెడలో వేసికొనెను | అతఁడపుడు శమంతకమణి నేమి చేసెను? |
| ద్వారకలోని వారతనిని సూర్యుఁడని తలఁచిరి | ద్వారకలోని వారతని నెవరని తలఁచిరి? |
| అతని మెడలోని మణి కాంతిచేత నతనిని సూర్యుఁడనితలఁచిరి $(BB)$ | అతఁడు సూర్యుఁడని వారు తలఁచుటకుఁ గారణమేమి? |
| | నల్లబల్ల సారాంశమును దుడిచి వేసి ఈప్రశ్నలను వేయవలెను. |
| (1) సింహావలోకనము — | సత్రాజిత్తు ఎవరు? అతనికిశమంతకమణి యెట్లు లభించెను? దాని |

ప్రభావ మెట్టిది? సత్రాజిత్తు ఎవరని జూడఁబోయెను? ద్వారకలోని వారు సత్రాజిత్తు నెవరనితలఁచిరి?

(౫) నల్లబల్ల సారాంశము — (దీనిని విద్యార్థులు చూచి వ్రాసికొనవలెను)

సత్రాజిత్తు ద్వారకకుఁ బోవుట.

ఆదిత్యుఁడు — సూర్యుఁడు
ఆరాధించుట—పూజించుట
తదనుగ్రహము — వాని దయ
రాజము — శ్రేష్ఠమైనది
సుభిక్షము కఱవులేకుండుట
విరాజిల్లుట—ప్రకాశించుట
దర్శన+అర్థి—చూడఁగోరిన వాఁడు.

సత్రాజిత్తు ఒకరాజు అతఁడు సూర్యుని దయచే శమంతకమణిని బొందెను అతఁడు శ్రీకృష్ణుని జూడఁబోయెను. అతని మెడలోని మణి కాంతిచేత నతనిని ద్వారకలోనివారు సూర్యుఁడని తలఁచిరి

## (3) వ్యాకరణ పాఠక్రమ సూచిక

ఉపాధ్యాయుని పేరు... ... ..... . ...బోధించుతరగతి ౫వ.

తేది.... .... ....   కాలము. 30 నిముసములు

పాఠము. వ్యాకరణము   అంశము కర్త, కర్మ, క్రియలు

లక్ష్యము కర్త, కర్మ, క్రియలననేవో బాలురకు బోధించి వారిచే "సామాన్య ధర్మ నిర్దేశము" చేయించుట.

ఉపకరణములు.—

| విషయము | పద్ధతి |
| --- | --- |
| (1) ప్రారంభము — | నీవు ఉదయమున అన్నము ను దింటివా? |
| (i) నేను ఉదయమున అన్నమును దింటిని. | వాఁడు (ఒకబాలుని జూపుచు) నిన్న సాయంత్రము ఏమి చేసెను? |
| (ii) వాఁడు నిన్న సాయంత్రము ఆటలను ఆడెను. | పిల్లలు బడిలో ఏమి చేయుదురు? |
| (iii పిల్లలుబడిలో పాఠములను జదువుదురు. | లక్ష్మణుఁడు శూర్పణఖను ఏమి చేసెను? |
| (iv) లక్ష్మణుఁడు శూర్పణఖ ముక్కును చెవులును గోసెను | కీచకుని భీముఁడేమిచేసెను? |
| (v) కీచకుని భీముఁడురాత్రి వేళ సంహరించెను | (iv),(v) వాక్యములు బాలుర వాచకములలో అయిన పాఠములలోనివి వానిని నల్ల బల్ల పై వ్రాయవలెను |

(2) ఉద్దేశ ప్రకటనము — ఈవాక్యములలోఁ గొన్ని పదములేమి సూచించునో తెలిసికొందము.

| | |
| --- | --- |
| (3) ప్రదర్శనము.— | లక్ష్మణుఁడు చేసిన పని యేమి? |
| కోయుట | భీముఁడు జేసిన పనియేమి? |
| సంహరించుట. | కోసెను,సంహరించెనుఅనుపదములేమి తెలియఁజేయుచున్నవి? |
| లక్ష్మణుఁడునుభీముఁడును జేసిన పనులను దెలియఁ జేయుచున్నవి | 'పని' యని అర్థమువచ్చు మఱొక మాటను జెప్పుము |

క్రియ

ఒకరు చేయుపనిని దెలి యఁజేయు మాటలను "క్రియ" లందురు.

లక్ష్మణుఁడు

భీముఁడు

ఆపదములు ఆ క్రియలను జేసిన వారెవరైనది యుఁ జెప్పును

క్రియలను జేసిన వారిని గూర్చి తెలుపు పదము లను "కర్త" లందురు

ముక్కును, చెవులును

కీచకుఁడు

మనము పూర్వమునఁ జేసిన కర్మలచేత సుఖ దుఃఖములఁ బొందుదుము

వారు చేసిన కర్మలచే ముక్కును, జెవులును కోయఁబడుటయు, సంహ రించఁ బడుటయు జరిగెను

'కోయుట' అను క్రియను జేసిన దెవరు?

'సంహారించుట' అను క్రియను జేసిన దెవరు?

లక్ష్మణుఁడు, భీముఁడు అను పద ములకును ఇంతకుముందు మనము చూచిన క్రియలకును సంబంధమేమి?

'కోయుట' అను క్రియ యొక్క ఫలితమును బొందిన దెవరు?

'సంహారించుట' అను క్రియ యొక్క ఫలితమును బొందిన దెవరు?

మనము సుఖములను గాని, దుఃఖములను గాని పొందుటకుఁ గారణమేమి?

శూర్పణఖ ముక్కును జెవులును కోయఁ బడుటయును కీచకుఁడు సంహారించఁబడుటయును దేనివల్ల జరిగెను?

క్రియల ఫలితమును బొందిన వానిని గూర్చి తెలియఁజేయు పదము లను "కర్మ" లందురు.

(4) సామాన్య ధర్మ నిర్దేశము —

ఒకరు చేసిన పనిని దెలియఁజేయు మాటలు క్రియలు. క్రియలనుజేసిన వారిని దెలియఁ జేయు మాటలు కర్తలు. క్రియల ఫలితమునుబొందినవానిని దెలియఁజేయు మాటలు కర్మలు.

(5) ప్రయోగము —

క్రియలన నేమి?
కర్తలన నేమి?
కర్మలన నేమి?

వాచకములో అయినపాఠములో నొక పరిచ్ఛేదములోని వాక్యములలో కర్త, కర్మ, క్రియలను వ్రాయించవలెను.

(6) నల్లబల్ల సారాంశము — (దీనిని విద్యార్థులు చూచి వ్రాసికొనివలెను.)

లక్ష్మణుఁడు శూర్పణఖ ముక్కును జెవులను గోసెను.

కీచకుఁడు భీముని రాత్రివేళ సంహరించెను.

(1) ఒకరుచేయుపనిని దెలియఁజేయుమాటలను "క్రియ" లందురు.

(2) క్రియలనుజేసినవారిని తెలుపుపదములను "కర్త" లందురు.

(3) క్రియల ఫలితముఁ బొందినవారిని తెలుపు పదములను "కర్మ" లందురు.